ఆంధ్ర చలనచిత్ర జగతిలో
ఒక నూతన శకమును ప్రారంభించిన
అపూర్వ జానపద చిత్రము...



వాహినీ వారి

# గుణసుందరి

కథ...

ఇప్పుడు ప్రతి కేంద్రమందును
శత దినోత్సవముల నందుకొనుచున్నది...



డైరెక్టర్... కె.వి.రెడ్డి, B.Sc.(HONS)  స్టూడియో.. వాహిని

# చందమామ

ఈ సంచికలో యివి
చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, ముగ్గులు,
ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు . 1686
మద్రాసు . 1.


ఆరోగ్యానికీ, రుచికరానికి



పూజలకు, వివాహాలకు




## గడియారం మార్కు కర్పూరము

ఉపయోగించండి.

గోపాల్జీ ఘూంపటి & కో.

యువ ప్రచురణలు

# ఆత్మార్పణ

★ [కథల సంపుటి] ★

రచన: 'చలం'

వెల: 1—8—0

---

# దేవదాసు

[నవల]

★ శరత్‌బాబు రచన ★

వెల: 1—8—0

★

...ముచ్చటైన ముద్రణతో,
... పుస్తక విక్రేతలందరి
...వ్రాయండి.

...

...వీధి,  పోస్టుబాక్సు 1686, మద్రాసు-1.





డైరక్షన్
టి.పి.సుందరం.

★ ★ ★

అంజలి దేవి..
జి.వరలక్ష్మి..
రఘురామయ్య..
శివరావు....
సౌదామిని...
యన్.టి.రామారావు
నటించినది

చమ్రియా రిలీజ్.

*Sole Distributors :*

**CHAMRIA TALKIE DISTRIBUTORS**

**VIJAYAWADA - GUNTAKAL - SECUNDERABAD**

# రు. 500 బహుమానము

## ఉమా గోల్డు కవరింగు వర్క్సు

ఉమా మహల్ :: మచిలీపట్నము

ఉమా గోల్డు కవరింగు వర్క్సు పోస్టాఫీసు.














అసలు బంగారు రేకు లోహము పైన అంటించి (Gold Sheet Welding on Metal) తయారు చేయబడినవి. కాదని రుజువు చేసినవారికి రు. 500 బహుమానమివ్వబడును. మేము తయారు చేయు ప్రతివస్తువు ప్యాకింగు పైన "ఉమా" అను ఇంగ్లీషు అక్షరములు గుర్తించి కొనవలెను. బంగారు వన్నె 10 సంవత్సరములు గ్యారంటి.

* * *

పరీక్ష చేయగోరువారు ఉమా ఆభరణములను మహాద్రావకములో వేసిన 5 నిమిషములలో బంగారము రేకు వెడలివచ్చును. ఈ విధముగా పరీక్ష చేసినవారు అనేకమంది మాకు సర్టిఫికేట్లు యిచ్చియున్నారు. 880 డిజయినుల క్యాటలాగు ఉచితముగా పంపబడును. ఇతర దేశములకు క్యాటలాగు ధరలమీద 25% అధికము.

*N.B.*—వస్తువుల వి. పి. పార్సెలు ఛార్జి 0-15-0 మాత్రమే అగును.

Tel: "UMA" MASULIPATAM.



# డోంగ్రెగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్నూ, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును, ఆరోగ్యము నిచ్చును.

K.T. Dongre & Co. BOMBAY-4

# ఖోడే ఫాన్సీ సిల్కు రిబ్బన్లు



దేశమంతటా ప్రఖ్యాతి పొందినవి.

ఆకర్షణీయమైన డిజైన్లు, దట్టమైన అల్లిక, శాశ్వతమైన రంగులు

వెల సరసము



## ఖోడే రిబ్బన్ కార్బన్ అండ్ అల్లైడ్ ఇండస్ట్రీస్

సంతూనపేట :: బెంగుళూరు సిటీ.

# చందూ యొక్క సాహసకృత్యములు


















ది టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

# ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెని, లిమిటెడ్

ప్రధాన కార్యాలయం : మచిలీపట్నం.

"ఆంధ్ర" పురోగమనములో మరొక అపూర్వఘట్టము.

1949 లో నూతన వ్యాపారము

సేకరింపబడినది .... రు. 2,02,00,000

పట్టాలుగా మారినవి .... రు. 1,64,00,000

1950 మా రజతోత్సవము

మా లాభములలో పాల్గొనుడు

జీవిత భీమాతోపాటు అగ్ని, మోటారు, నౌకా ప్రమాదములకు పట్టాలివ్వబడును.

మా మద్రాసు ఆఫీసు : 337, తంబుచెట్టి వీధి, మద్రాసు.

ఇండియా అంతటను మా ఆఫీసులు గలవు.

# గ్యారంటీ స్టెయిన్ లెస్ స్టీల్ పాత్రలు

మాసిపోవు. ఎప్పుడు కాంతిగా నుండును. చౌక, అందమైనవి.



లోటాలు, డబ్బాలు, టిఫన్ కారియర్లు, కప్పులు, అడుగుసెట్లు, స్పూన్లు. ప్లేట్లు పచ్చడికిన్నం సెట్లు. జల్లిగంటెలు. అన్నకుట్టి వగైరా ప్రతియింటికి, హోటలుకు కావలసిన పరికరములన్నియు దొరకును. ఇవి వ్యాపారస్తులందరివద్ద దొరకును




మా షోరూమ్ను సందర్శించండి

498, మింట్‌స్ట్రీట్, మద్రాసు - 3

~~~~~~ తయారుచేయువారు ~~~~~~

ఇండియన్ మెటల్ & మెటలర్జికల్ కార్పొరేషన్

498, మింట్‌స్ట్రీట్ :: మద్రాసు - 3
~~~~~~

# నమ్మిక! ...

అత్యుత్తమమైన టాయిలెట్ సబ్బులో
ఏమేమి మీరు కావలెనంటారో, అవన్నీ
మైసూరు శాండల్ సబ్బులో
కలవని నమ్మకముగా చెప్పగలము

ప్రతిచోట దొరుకును

గవర్నమెంటు సోప్ ఫ్యాక్టరీ
బెంగుళూరు

పండిత డి. గోపాలాచార్యులవారి

స్వర్ణోత్సవము
1898 - 1948

# అరుణ

Aruna

గర్భాశయ
రోగనివారిణి

ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్, మదరాసు 17.

# "షావుకారు" ను గురించి పత్రికలూ, ప్రముఖులూ వెలువరించిన ప్రశంసాపూర్వక అభిప్రాయాలు

"ఇంత చక్కని చిత్రాన్ని, అందులో సాంఘిక చిత్రాన్ని, తెలుగు చిత్ర కళాభారతికి సమర్పించిన నిర్మాతలు చక్రపాణి, నాగిరెడ్డిగార్లను, దర్శకుడు ప్రసాద్‌ను అభినందించక తీరదు."

— ఆంధ్రప్రభ.

"....అందులో పాత్రలన్నీ మనకు ఏవూరు వెళ్లినా మనం షావుకారులో చూచినట్లే కనిపిస్తూవుంటవి. ....ప్రతి స్వల్ప విషయంలోను నిర్మాతలు చాల శ్రద్ధ తీసుకొన్నారు. మన తెనుగు గ్రామాల జీవితాన్ని చక్కగా ప్రతిబింబింపచేశారు. యిలాంటి, కళాఖండాన్ని అర్పించిన నాగిరెడ్డి, చక్రపాణి, డైరక్టర్ ప్రసాద్ అభినందనీయులు."

— ఆంధ్రపత్రిక.

"మొట్టమొదటగా మనకి ఆశ్చర్యం కలిగించేది అంత నిర్దుష్టంగా పల్లెటూరి వాతావరణాన్ని ఎలా చిత్రించగలిగారా అని. ఆ పల్లెటూరు కేవలం తెలుగువారి గ్రామం. నీది, నాది, మనందరిదీ. షావుకారు చిత్రం చూశాక నిజంగా తెలుగు ప్రేక్షకుడికి ప్రాణం లేచివస్తుంది. అసహజత్వం ఎక్కడాలేదు....తిరిగి ఎన్నాళ్ళకో చక్కని "మ్యాటినీయేటర్స్" చిత్రం చూచినట్టుగా వుంది."

— స్వతంత్ర.

"....వాస్తవ జీవనంలోని రసవత్తర ఘట్టాల్ని తీసుకొని చిత్రాన్ని చాలామటుకు చిత్రించగలిగారని చెప్పవచ్చు."

— ఆంధ్ర వారపత్రిక.

"....తప్పక చూడవలసిన చిత్రం. చిత్రం అత్యుత్తమ తరగతికి చెందుతుంది."

— ఆంధ్రవాణి

"షావుకారులో యిది బాగావుంది యిది బాగా లేదు అనడానికి వీల్లేదు. చిత్రం అన్నివిధాలా అందంగా ఆకర్షవంతంగా చూడదగ్గదిగా వుంది."

— చిత్రాంగి

"కథావస్తువులో, పరిసరాలలో, వాతావరణంలో, భాషలో, భావంలో తెలుగుతనం తొణికిసలాడుతూంది."

— జ్వాల

"నేటికొక ప్రజల చిత్రం."

— జ్యోతి

"....విజయవారి "షావుకారు" గ్రామ జీవితంలో జరిగే సంభవాల్ని ఉన్నవున్నట్టుగా చిత్రించ గలిగింది. వినోదానికీ, వికాసానికీ తగిన ఉత్తమ చిత్రం...."

— హిందు

"....గ్రామ జీవితాల్ని చాలా అద్భుతంగా చిత్రించి కడపటి వరకు ఉత్సాహాన్ని రెట్టిస్తుంది...."

— ఇండియన్ ఎక్స్‌ప్రెస్

"....ఈ చిత్రం పల్లెటూరి జీవితాన్ని బహు నేర్పుగా చిత్రిస్తుంది...."

— మెయిల్

"....షావుకారు" నేటివరకు నేను చూచిన హిందీ చిత్రాలలో ఉత్తమోత్తమ చిత్రంతో సరితూగగలదని నా అభిప్రాయం."

— డి. జి. బిందు,
ప్రెసిడెంట్, హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్

"చిత్రం గ్రామీణుల జీవితాలలోని అతి స్వల్ప విషయాలతో చక్కగా యిమిడివుంది."

— శ్రీ రామచంద్రరావు,
జనరల్ సెక్రెటరి, హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్

"గ్రామీణుల సామాజికజీవితాన్ని బహు చక్కని తీరున షావుకారులో చిత్రించి, ప్రబోధకరంగా తయారుచేశారు."

— శ్రీ బి. రామకృష్ణారావుగారు.
హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్

ఆంధ్రా : సీడెడ్ : నైజాం : బెంగుళూరు : మద్రాసు
మున్నగు చోట్ల ఇప్పుడు ప్రదర్శింపబడుచున్నది



# అట్టమీది బొమ్మ

ఒక రోజున నారదమహర్షి కంసుని దర్బారుకు రాగా, ఆయనకు అర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించి, "మహాత్మా! త్రిలోకసంచారులైన తమకు తెలియని విశేషాలు ఉండవుకదా! వినవలసిన సమాచారాలుంటే సెలవీయండి" అని కోరాడు, కంసుడు.

అందుకు నారదుడు "ఓయి మహారాజా! నీ కోటలో జరిగే అంతఃపుర రహస్యాలే నువ్వు తెలుసుకోలేకున్నావు. ఎంత వెర్రివాడవు! ఇప్పుడు కొంప మునిగింది. నీ ప్రాణానికే మోసం వచ్చింది. ఆ సంగతి నీ చెవిని వేసి పోదామనే వచ్చాను" అనేసరికల్లా కంగారు పడుతూ కంసుడు అదేమిటో చెప్ప వలసిందని ప్రాధేయపడ్డాడు.

అప్పుడు నారదమహర్షి ఈ రహస్యం వెల్లడించాడు. "ఓయి కంసా! దేవకీ వసుదేవులకు పుట్టినదని నీవు అనుకొన్న అష్టమ శిశువు యోగమాయ ఐ, నిన్ను హెచ్చరించి, అదృశ్యమైన సంగతి జ్ఞాపకమున్నదా? ఆమె నిజానికి గోకులంలో యశోదా నందులకు జన్మించింది. దేవకీ వసుదేవులకు ఎనిమిదవసారి శ్రీకృష్ణుడే పుట్టాడు. పుట్టిన వెంటనే శ్రీకృష్ణుడు యశోద వద్దకూ, యశోద పక్కలో వుండే స్త్రీశిశువు దేవకి వద్దకూ చేసుకోవటానికి పన్నాగం జరిగింది. దేవకి పక్కలో ఉండే ఆడశిశువును నీవు చంపబోతే అది యోగమాయగా మారి ఎగిరిపోయింది. బృందావనంలో నందుని ఇంట్లో కృష్ణుడూ, వాని అన్న బలరాముడూ పెరిగి పెద్దవారై నీ పరివారాన్నంతటినీ నాశనం చేస్తున్నారు. కనుక జాగర్తగా ఉండు" అని చెప్పాడు.

ఈ వార్త విన్నవెంటనే కంసుడు దేవకి వసుదేవులను దర్బారుకు రప్పించి వాళ్ళను చంపబోయేసరికి, నారదుడు అడ్డుపడి మందలించాడు. అప్పుడు కంసుడు కొంచెం తటపటాయించి, "సరే, ముందు వీళ్ళను ఖైదులో పెట్టండి" అని ఆజ్ఞాపించగా, భటులు దేవకి వసుదేవులకు సంకెళ్ళువేసి తీసుకపోయారు.



# చందమామ

పిల్లల కథల మాసపత్రిక
సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 6 | మే 1950 | సంచిక 5

క్రిందటినెల "చందమామ సామెతకథలపోటీ" ప్రారంభిస్తూ మంచి మంచి సామెతకథలను వ్రాసి పంపమన్నాను. మీలో చాలామంది ఎంతో వుత్సాహంతో కథలు వ్రాసి పంపారు గాని, వాటిలో ఎక్కువభాగం స్కూలు పుస్తకాలనించి కాపీ చేసి వ్రాసినవిగానే, లేక ఇదివరకు చందమామలోనూ, మరి ఇతర పత్రికలలోనూ వేసిన కథలుగానే వున్నై. నిజం చెప్పాలంటే మీరు వందలకొలది కథలు పంపారన్నమాటే గాని, వాటిలో ఒక్కటికూడా బహుమతి యివ్వతగ్గవిగా కన్పించలేదు. ఈ పోటీకి ముగింపు తేదీ అంటూ ఏమీలేదు కనుక, యిప్పటికైనా మీరు చక్కటి సామెతకథలు వ్రాసి పంపి బహుమతిపొందే అవకాశం వుంది.

మీ పెద్దవాళ్లు ఎన్నో రకాల సామెతకథలు చెబుతూ వుంటారు. వారు చెప్పినవి ఒక చెవిని విని మరోచెవిని వదలి పెట్టకుండా, నేర్చుకోవాలనే కుతూహలంతో వాటిని శ్రద్ధగా గుర్తుంచుకోగలిగితే మీరు చక్కటి సామెతకథలు ఎన్నోవ్రాసి పంపగలరు. ప్రయత్నించిచూడండి. కథలు పంపవలసిన అడ్రసు మరోసారి జ్ఞాపకం చేస్తున్నాను. గుర్తుంచుకోండి.

చందమామ 'సామెతకథల' పోటీ,
చందమామ ఆఫీసు,
పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు.

# కిలాడి

పట్టణానికేగు నొక్క
పల్లెటూరి శాస్త్రులు
కట్టమీద వెదకుచున్న
పొట్టి కుఱ్ఱవానితో

శాస్త్రులు :

"వంగి వెదకుచుంటి వసలు
సంగతేమి నాయనా ?"

బాలుడు :

"ఉంగరంబు బాబయా
ఊడిపోయె నిచ్చట."

శాస్త్రులు :

"పిల్లవాడ! నాతొ నీవు
కల్లలాడు చుంటివా ?"

బాలుడు :

"కల్లగాదు, కల్లగాదు
తల్లితోడు బాబయా."

శాస్త్రులు :

"వెదకికొమ్ము పాపము
వెళ్లిపొదు నే" ననఁగ

బాలుడు :

"చేయిపట్టి వేడుకొందు
సాయపడుము బాబయా,
సొమ్ము దొరకినేని సెరి స
గమ్ము జేసుకొందము."

రచన:
'కవిరావు'

అట్టులనగ నమ్మతించె
ఆశగొట్టు శాస్త్రులు.
వంగి వెదకుచుండ ముద్దు
టుంగరంబు దొరకెను.
సంతసించి బాలుడంత
శాస్త్రితోడ నిట్లనె -

బాలుడు:

"అయ్యా మీకు నగముభాగ
మియ్యవలయు నిజముగ
యేమిచేతు చిల్లిగవ్వ
యైన లేదు చేతిలో?"

"వస్తువిమ్ము నగము సొమ్ము
నిస్తు" ననగ శాస్త్రులు
నమ్మతించి బాలుడు
నంత లెగురవేసెను.

"ఏబది రూప్యములు దీని
వెల" యనంగ బాలుడు
ఇరువదైదు రూకలిచ్చి
ఇంటికేగె శాస్త్రులు.

డాబునరిగ దానిని ష
రాబు కీయ నాతడు
గిల్టు దనగ శాస్త్రులు
గ్రుడ్లు మిటకరించెను.








ఒకప్పుడు జగన్మాత లోకాలను రక్షించి ప్రజలనందరినీ సౌఖ్యంగా ఉంచగలిగేది. సప్తగ్రహాలనూ, పంచభూతాలనూ, సృష్టి నంతటినీ తన అదుపులో ఉంచుకొని, ప్రజలకు కష్టాలు కలుగకుండా చూస్తూవుండేది. ఎలాగంటే, భూమి మీద వర్షం తక్కువైనప్పుడు సూర్యుణ్ణి బంధించివేసి, మేఘుణ్ణి వదిలిపెట్టేది. కావలసిన వర్షాలు కురవటం వల్ల పంటలు చక్కగా పండి, భూమి చల్లబడి ప్రజలు హాయిగా ఉండేవాళ్ళు. అలానే చంద్రుణ్ణి, నక్షత్రాలను, వాయుదేవుణ్ణి, సాగరరాజునూ— సమయం కనిపెట్టి, తరుణంలో వదులుతూ వాళ్ళపని తీరగానే మళ్ళీ బంధించివేస్తూ ఉండటం చేత, లోకాలు సౌఖ్యంగా ఉండేవి.

ఐతే- ఇంతపని చక్కబెట్టుకోవటం ఆమె ఒక్కతెవల్ల నవుతుందా?—కనుక, తనకు సహాయం చేయటానికి మనిషి కావాలె. ఆ మనిషి ఎవరో ఒకరైతే పనికి రాదు. తనలాగ్గానే బాధ్యతవహించి, జాగర్తగా నమ్మకంగా పనిచేయగలవాళ్ళు కావాలె. అనుకోవటమేగాని, అంత నమ్మకమైన మనిషి దొరకడం మాటలా?

ఒకరోజున జగన్మాత తన విమానం మీద బయల్దేరి భూలోకంలో దిగింది. వెళ్ళగా వెళ్ళగా ఆమెకు ఒక పూరిల్లు కనుపించింది. అందులో ఒక తల్లీ, కూతురూ మాత్రమే వున్నారు. జగన్మాత దృష్టి అందాలబరిణె ఐన ఆ బాలికపైన పడింది. తను అనుకొనివున్న ఏవో కొన్ని లక్షణాలు ఆ బాలికలో జగన్మాతకు పొడకట్టినై. అందుచేతనే సుజాత దేవిని ఆకర్షించింది.

జగన్మాత కనపడగానే సుజాత తల్లి తన పేదరికాన్ని గురించి వలపోసికొనజొచ్చింది: "నా కూతురైనా సుఖపడటానికి

యం. సుహాసిని, సికింద్రాబాదు



పెట్టి పుట్టలేదుకద!"— అంటూ వలవల యేడ్చింది. అటువంటి సమయంలో జగన్మాత ఆమెను ఊరడించి, "అమ్మా! నీ కుమార్తెకు వచ్చిన లోటు ఏమీ లేదు. ఆమెను నాతో పంపించివెయ్యి. ఆ పిల్ల సౌఖ్యాలన్నీ నేను సమకూరుస్తాను. ఆమె ఒక మహారాణి కాగల లక్షణాలున్నాయి" అనేసరికి, మారు ఆలోచన లేకుండా ఆ తల్లి "అంతకంటేనా అమ్మా! ఈమాత్రం మాట ఇంతవరకు అన్నవాళ్ళు ఎవరూ లేకపోయారు. నా కూతురు ఎక్కడో ఒక చోట క్షేమంగా వుంటే నా కదే పదివేలు" అంటూ, సంతోషంతో అంగీకరించిందది.

బాలికను విమానంలో ఎక్కించుకుని తన దివ్యభవనానికి తీసుకుపోయింది జగన్మాత. ఆమె తను చేస్తూవున్న పనులన్నీ సుజాతకు నేర్పింది. కొద్దిరోజుల్లో గ్రహాలను బంధించటం, వదలటం, మొదలైన పనులన్నీ జగన్మాత లేకపోయినా తను చేసుకుపోగలిగిన స్థితికి వచ్చింది సుజాత.

భవనానికి తూర్పు దిక్కున ఉండే మూడు గదులుమాత్రం ఎన్నడూ చూడ వద్దనీ, అటువైపు పోనేవద్దనీ సుజాతని జగన్మాత గట్టిగా హెచ్చరించింది. అందుకు సుజాత "వెళ్ళను దేవీ!"— అని మాట యిచ్చింది. కానైతే, సుజాత దృష్టి ఎంతసేపూ ఆ వద్దన్న మూడుగదులమీదనే ఉంటూ వచ్చింది.

ఇలా ఉండగా ఒకనాడు, జగన్మాత ఏదో పనిమీద బయల్దేరి వెళ్లింది. ఇదే అదునని తలిచి, ఆత్రంతో వుండిన సుజాత మెల్లిగా ఆ మూడు గదులలోనూ మొదటి గది వద్దకు పోయి, ఏముందోనని తొంగి చూచింది. ఆమె అలా చూచేసరికల్లా తలుపు సందులోనించి ఒక తోక చుక్క ఇవతలకు వచ్చి, రివ్వుమంటూ తారాజువ్వలాగ ఆకాశానికి ఎగిరిపోయింది.



ఈ విడ్డూరం చూచి, ఏమిచేయటానికీ తోచక, సుజాత భయపడిపోయింది. ఇంతలో దేవి కోపంగావచ్చి, "ఇంతకాలం నావద్ద నమ్మకంగా ఉండి ఇలా దగా చేస్తావా? నీవుచేసిన తప్పిదంవల్ల ఎప్పుడో ప్రళయకాలంలో రావలసిన తోకచుక్క తప్పించుకువచ్చి ఆకాశంమీద ఇప్పుడు వెలిసింది. దీని ప్రభావంచేత ఇప్పుడు ఎందరో మహామహులు అకాలమరణం పొందుతారు. ఇంకా దేశంలో ఎన్నో అరిష్టాలు కలగబోతున్నాయి. ఇలా ఐతే నీవు నాదగ్గర ఉండటానికి వీలులేదు" అని మండలించింది.

అప్పుడు సుజాత ఈ తప్పు క్షమించుమని కోరి, ఇటుపైన తిన్నగా ఉంటానని మాట ఇచ్చింది.

ఈవిధంగా ఒకటి రెండేళ్లు గడిచిన తరువాత జగన్మాత మళ్ళీ ఒకసారి భవనం విడిచి వెళ్ళవలసివచ్చింది. ఉత్సాహంతో ఉరుకలు వేస్తున్న సుజాత మునుపు జరిగిన సంగతి అంతా మరచి, ఈసారి రెండవ గదివద్దకు పోయి, మెల్లగా తలుపు ఒత్తిగించి. తొంగిచూసింది. అప్పుడు అనేకమైన వికారస్వరూపాలతో క్షామదేవత తలుపు సందులోనించి తప్పించుకొనివచ్చి, ఎగిరిపోయింది. వెంటనే దేవివచ్చి, సుజాత పైన ఉగ్రురాలైపోయింది. సుజాత ఈమారుకూడా అనేకవిధాల ప్రాధేయపడేటప్పటికి, దేవి క్షమించి "ఇంకొకసారి నీతితప్పి నడచుకొన్నావంటే నీవు ఇక్కడినించి వెళ్ళిపోవలసిందే. కనుక జాగర్తగా ఉండు" అని హెచ్చరించింది.

మళ్ళీ మామూలుగా తన పనులు నెరవేర్చుకొంటున్నది సుజాత. తరువాత రెండు మూడు సంవత్సరాలకు మళ్లీ జగన్మాత పనిమీద వెళ్లింది. ఆమె వెళ్ళగా చూచి, సుజాత "ఈమారు అదమరచి



ఉండను. నేను చూచినప్పుడు ఆ గ్రహం బయల్దేరగానే, అది తప్పించుకు పోకుండా తలుపు గట్టిగా వేసేస్తాను" అనుకొంటూ, మూడవగదిదగ్గరకు వెళ్లి, మెల్లిగా సందులోనించి తొంగిచూచింది.

కాస్తంత సందు దొరికితే తప్పించుకు పోదామని ఎదురుచూస్తూవున్న తుపాను గ్రహం పెనుగాలి వీచుకొంటూ, కెరటాలు రేపుకొంటూ ప్రళయ భీకర రూపంతో అప్పుడు తప్పించుకుపోయింది. ఎంత ప్రయత్నించినా, దానిని బయటకు పోకుండా ఆపటానికి సుజాతవల్ల కాలేదు.

తక్షణమే దేవి రుద్రావతారంతో వచ్చేసి, "ఇక నీవు ఇక్కడ క్షణమైనా ఉండటానికి వీలులేదు. నన్ను మోసంచేసిన ఫలితంగా నాశనమైపోతావు పో, పో" అన్నది. చివరకు సుజాత ఎన్నోవిధాల ప్రార్థించగా "నీవుచేసిన తప్పిదానికి శిక్ష తప్పదు. మూగిదానివై అడవులవెంట తిరుగుతూ వుండు నీకు పశ్చాత్తాపం ఎప్పుడు కలుగుతుందో అప్పుడు మళ్ళీ నీకన్నీ అనుకూలమవుతై" అని చెప్పి దేవి వెళ్ళిపోయింది.

శాపం పొందిన సుజాత అడవులు పట్టి పోతూ, విశ్రాంతికోసం ఒక చెట్టు పలవలో కూర్చుంది. ఆ చెట్టు ఒక కొలను ఒడ్డున ఉన్నది. ఇంతలో ఆ ప్రక్క పట్టణాన్ని ఏలే రాజకుమారుడు వేటనించి తిరిగివస్తూ కొలనులో కాళ్లు చేతులు కడుగుకుందామని కొలనుదగ్గిరికి వచ్చాడు. అప్పుడు ఆ రాజకుమారునికి చెట్టుపైన కూర్చున్న సుజాత ప్రతిబింబం నీటిలో కనిపించగా తల ఎత్తిచూచాడు. సుజాత చక్కదనాన్ని చూచి రాజకుమారుడు తనకు రాణిగా ఉండుమని ఆమెను కోరాడు. ఆమెకు శాపముున్నదిగా, మరి? కనుక నోటివెంట మాటలేక, తన సంగతి ఏమీ చెప్పలేక పోయింది, సుజాత.

కొత్తచేత సిగ్గుపడుతున్నదేమో అనుకొన్నాడుగాని, సుజాత మూగదన్న సంగతి రాజకుమారునికి తెలియనే తెలియదు. క్రమంగా సిగ్గుతీరినతరువాత ఆమె మాటాడక పోతుందా అని తలిచాడు. ఎలా ఐతేనేం, అతివైభవంగా వారిద్దరకూ వివాహం జరిగింది.

సుజాత అందాలబరిణె అన్నమాట నిజమే. కాని, ఎన్నాళ్ళకూ మాటాడక పోయేసరికి, రాజకుమారునికి ఆమెపైన చీకాకు కలిగి, ఒక పూరిగుడిసె వేయించి అందులో ఉండమన్నాడు.

పూరిగుడిసెలో ఒక్కర్తె ఉండినప్పటి నించీ సుజాతకు తన తప్పిదాలన్నీ ఒక టొకటే జ్ఞాపకానికి వచ్చి పశ్చాత్తాపం కలిగింది. తన మేలు కోరిన జగన్మాతను వరుసగా మూడుసార్లు మోసంచేసిన నేరం గుర్తుకి వచ్చి, దుఃఖించింది. ఈ విధంగా సుజాత పశ్చాత్తాపపడేసరికి ఆమె శాపం తీరిపోయి, చిలుకపలె చక్కగా మాటాడ జొచ్చింది.

ఆ రాత్రి రాజకుమారునికి ఒక స్వప్నం వచ్చింది. కలలో జగన్మాత కనిపించి, సుజాత చరిత్ర అంతా పూసగుచ్చినట్టు చెప్పింది. తక్షణమే అతను పరివారాన్ని వెంటబెట్టుకుని పూరిగుడిసెకు వచ్చి చూడగా అందాలబరిణె ఐన సుజాత శాపవిముక్తి కావటంవల్ల చిలుకలాగా మాటాడింది. రాజకుమారుడేగాక, రాజ్యం లోని ప్రజలందరూ ఈ వింతసంఘటనకు ఆశ్చర్యపోయి, సంతోషించారు. నాటినించీ సుజాత పట్టపురాణి ఐ సుఖంగా ఉంది.

సుజాత ఐతే సుఖంగానే ఉన్నదిగాని, ఆమె చేసిన పొరపాటువల్ల, నాటినించీ తోకచుక్కలు, కామదేవతలు, తుపాను గ్రహాలూ మళ్ళీ జగన్మాత అదుపులోకి వెళ్లటం మానేసి, ఇప్పటికీ ప్రజల్ని పట్టి పీడిస్తున్నాయి.






ధీరసింహుడు మరునాడు సులోచనవద్దకు వచ్చి "నీ తరువాత ప్రశ్న ఏమిటి?" అని అడిగాడు.

సులోచన అతనిని మర్యాదచేసి కూర్చొబెట్టి, "ఓయి ధీరసింహుడా!— ఇక్కడకు ఈశాన్యదిక్కున శబ్దభేది అనే పర్వతం ఉన్నదట. ఆ పర్వతంలోపల ఏమిచిత్రం వున్నదో, దాని అవతల ఏ దేశ మున్నదో కనుక్కురావాలి. ఇదే నా ఆఖరు ప్రశ్న" అంటూ చెప్పింది. ధీరసింహుడు మునపటిలాగానే ఆమెవద్ద గడువు తీసుకుని, ఈశాన్య దిశకు బయల్దేరాడు.

చాలా దూరం నడిచివెళ్లి, ధీరసింహుడు ఒక వింత దేశంలో ప్రవేశించాడు. ఆ దేశంలో ఎక్కడా ఒక్క గోరీకాని, శ్మశానం గాని అతనికి కనపడలేదు. ఈ విడ్డూరానికి ఆశ్చర్యపడుతూ, ధీరసింహుడు పోయి పోయి ఒక గ్రామం చేరుకున్నాడు.

అప్పటికి ధీరసింహునికి నకనకమని ఆకలవుతున్నది. ఏమి చేయటమా అని ఆలోచిస్తూవుంటగా, ఎదుటి ఇంటిలోనుంచి ఒక గృహస్థు ఇవతలకి వచ్చి, అతనిని కుశల ప్రశ్నలు వేసి, ఆదరించి తన ఇంటికి అతిథిగా తీసుకువెళ్ళాడు.

వడ్డన జరిగింది. భోజనాలు అవుతూ వుండగా గృహస్థు ధీరసింహునితో "మీ దేశంలో మీరు ఎన్నో రకాల పదార్థాలు ఆరగించివుంటారు కాని, ఈ పదార్థం మాత్రం రుచిచూచివుండరు" అంటూ విస్తట్లో ఒక వేపున వేలుపెట్టి చూపాడు. 'ఐతే అది యేమిటి?' అని ధీరసింహుడు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు. "అదే నర మాంసం" అని గృహస్థు జవాబు చెప్పే వరకు, ధీరసింహుడు 'పాపాత్ముల్లారా! ఇటువంటి పనులా మీ దేశంలో చేసేది!" అని కోపగించి, లేచిపోబోయాడు.



అప్పుడు గృహస్థు అతన్ని సముదాయిస్తూ, "అయ్యా, జబ్బుపడినవాళ్ళనూ, ముసలివాళ్ళనూ చంపి, తినివేయటం మా దేశాచారం, అందువల్లనే మీకు అటువంటి వాళ్ళెవళ్ళూ ఇక్కడ కనిపించరు. పోనీ, అంతగా మీకిష్టంలేకుంటే ఈ పదార్థం తినటం మానివేయండి" అంటూ, అతనికి పాలూ, పండ్లూ, మరికొన్ని శాకాహారాలూ తెప్పించి పెట్టాడు.

గృహస్థు చెప్పిన ఈ భోగట్టా వినగానే అప్పటికి తెలిసివచ్చింది ధీరసింహునికి— ఆ దేశంలో ఒక్క శ్మశానంగాని, ఒక్క గోరీకాని ఎందుకు కనిపించలేదో.

అక్కడినించి ధీరసింహుడు మళ్లీ కొంత దూరం వెళ్ళగా, ఒక పట్టణం తగిలింది. ఆ పట్టణ ప్రజలను శబ్దభేది పర్వతాన్ని గురించి కనుక్కొంటే 'ఇంకా పదికోసులు దూరం పోవా'లన్నారు. సరేనని తిరుగా బయల్దేరి పోయేవరకూ, మరొక పట్టణం తగిలింది. అక్కడకూడా భోగట్టా చేయగా 'మరొక్క కోసెడు దూరం పోయి కనుక్కో' మన్నారు. అక్కడినించి కొంతదూరం వెళ్ళగా మరొక పట్టణం తగిలింది. ఆ ఊరివారిని అడిగితే "ఇంకొక్క మైలు దూరంలో వున్నది ఆ పర్వతం" అని చెప్పారు.

కొంచెంసేపు ఆ పట్టణంలోనే విశ్రమించి, చివరకు ధీరసింహుడు పర్వతం చేరుకున్నాడు. ఆ పర్వతం ఎంతో ఎత్తుగా వున్నప్పటికీ, అతను ఎలానో శ్రమపడి ఎక్కాడు. ఆ పర్వతం చూడటానికి మామూలు అన్ని పర్వతాలలాగానే వున్నది కాని, విశేషాలేమి కానరాలేదు. కనీసం చెట్లూ మొక్కలూ ఐనా కనిపించలేదు. పచ్చగడ్డిమాత్రం అంతటా పరుచుకొని వున్నది. ఆ పచ్చగడ్డి లేనిచోట, లోపలి నుంచి ఎర్రటి రాళ్ళు తొంగిచూస్తున్నై.

వింతలేమైనా కనిపిస్తాయేమోనని చాలా సేపు కనిపెట్టివుండి, ఏమీ కనపడకపోయే సరికి ప్రాణం విసిగి, ధీరసింహుడు పర్వతం మీదినుంచి దిగి వచ్చేశాడు.



దిగివచ్చేశాడేకాని, పట్టుదల గల ధీరసింహుడు ఊరుకొంటాడా?— ఎంత కాలమైనాసరే అక్కడనే ఆగి, ఆ పర్వతం యొక్క పుట్టుపూర్వోత్తరాలు కనుక్కొని గాని పోకూడదని నిశ్చయించుకొన్నాడు. ఈ నిశ్చయంతో అతను ఆ పట్టణంలోని ఒక సత్రంలో బసచేశాడు. అతని మంచితనం వల్ల అక్కడివారందరూ స్నేహితులైనారు. అందులోనూ ముఖ్యంగా వీరవర్మ అనే యువకుడు ధీరసింహునికి ప్రాణస్నేహితుడైనాడు. వారిద్దరూ ఒకరినొకరు విడిచి ఒక్క క్షణమైనా ఉండలేకపోయేవారు.

ఈవిధంగా కొన్నాళ్ళు గడిచినై. ఒక రోజున వీరవర్మ, ధీరసింహుడూ కలిసి ఆ పట్టణపు బజారులో తిరుగుతూవుండగా, చీకటి పడిపోయింది. కాని, కలకల్లాడుతూ దీపాలు ఉండటంచేత, బజారంతా దేదీప్యమానంగా వెలిగిపోతున్నది. స్నేహితులిద్దరూ సరదాగా కబుర్లు చెప్పుకొంటూ ఆ బజారువెంబడి పచార్లు చేస్తూవుండేటంతలో శబ్దభేది పర్వతం ఉండే దిక్కునుంచి "రా, రా, శీఘ్రం రా" అనే ఒక పెద్దకేక వినిపించింది. ఆ కేక మానవుల కంఠస్వరంలాగా కాక, పర్వతంలోనుంచి బయల్దేరిన మేఘగర్జనలాగా ఉన్నది.

తక్షణమే, ధీరసింహ వీరవర్మలకు ఎదురుగా తిరుగుతూవున్న గుంపులోనించి ఒక మనిషి, ఆ కేక వినిపించిన దిక్కుగా, వెర్రివానిలా పరుగెత్త జొచ్చాడు. అప్పుడు ఆ మనిషి ముఖం అవోకలాగా ఐపోయింది. వాని కళ్ళు ఎక్కడో చూస్తున్నై. అతనికి తన శరీరమూ బయటి ప్రపంచమూ రెండూ తెలియకుండా పోయినై.



వాని వెంట ధీరసింహుడుకూడా కొంత దూరం పరుగెత్తాడు. ఇంతలో నలుగురూ కలిసి వానిని అడ్డుచేయుగా, వాడు వెనక్కు తిరిగివచ్చాడు. తరువాత ధీరసింహుడు వానితో "ఇంకెప్పుడూ ఇలా చేయకు" అని మందలించి పంపి, స్నేహితుడైన వీర వర్మను "ఆ కేక ఏమిటి? ఈ మనిషి ఆ వైపు పరుగెత్తట మేమిటి? దీని రహస్యం వివరించి చెప్పవలసిం"దని ఆత్రంతో ప్రశ్నించాడు.

అప్పుడు వీరవర్మ అతనితో "ఏయి నేస్తం!— ఆ కేక ఎందుకు వస్తుందో ఎవరికీ తెలియదు కాని, అప్పుడప్పుడు ఇటువంటి శబ్దం ఆ పర్వతంలోనించి వస్తుందని మాత్రం అందరికీ తెలుసు. ఆశబ్దం ఎవరి నైతే పిలుస్తుందో, వాడు ప్రపంచాన్ని మరిచి పోయి, పర్వతం వేపు వెర్రిగా పరుగు తెత్తుతాడు. అలా పరుగెత్తిపోయిన వాళ్లలో ఒకళ్ళూ ఇంతవరకూ తిరిగి రాలేదు. వాళ్ల కొసం దుఃఖించి ప్రయోజనం లేదు. అందు కనే, అలా వెళ్ళిపోయినవాళ్ళనుగురించి ఈ పట్టణంలో ఎవరూ విచారించరు," అని చెప్పాడు.

ధీరసింహుడు నలుదిక్కులా కలియ జూచాడు. ఆ పోయిన వానిని గురించి నిజంగానే ఎవరికీ పట్టినట్టే కనిపించలేదు. ఈ సంగతి అతనికి ఆశ్చర్యం కలిగించింది. ఆలోచనలో మునిగి, అతను తన బసకు తిరిగివెళ్ళాడు.

ఇలా వారంరోజులు గడిచినతరువాత, మళ్ళీ ఒకరోజున వీరవర్మ, ధీరసింహుడూ మామూలుగా బజారులో షికారు చేస్తున్నారు. మళ్ళీ ఈ రోజున మునుపటి మోస్తరుగానె ఆ పర్వతం మీదినుంచి "రా, రా, శీఘ్రం రా" అనే కేక వినిపించింది. ఈ కేక ఎవరిని ఉద్దేశించిందో, ఈ సారి ఎవరి వంతోనని ధీరసింహుడు అక్కడ

వున్న అందరివేపూ పరిశీలనగా చూస్తూ వున్నాడు. అతను అలా చూస్తూ ఉండగానే, తన ప్రాణమిత్రుడైన వీరవర్మ అతని చేయి విడిపించుకుని పర్వతంవేపు వెర్రిగా పరుగులెత్త నారంభించాడు.

అప్పుడు ధీరసింహుడు గ్రహించాడు, అప్పుడు వచ్చిన పిలుపు తన ప్రాణ స్నేహితుడైన వీరవర్మకోసమేనని. "సరి, ఏమైనాకానీ, ఈసారి ఈ పర్వతం యొక్క రహస్యం కనుక్కుని తీరాలె అని నిశ్చయించుకొని, అతను విడవకుండా తన స్నేహితుడైన వీరవర్మను వెంబడించాడు. కొంతసేపటికి వాళ్ళిద్దరూ ఒకరి వెనుక ఒకరు ఆ కొండ దాపునకు చేరుకున్నారు. ఇద్దరూ కొండ ఎక్కటానికి ప్రారంభించారు. పైకి కొంతదూరం వెళ్లగా, వారికి ఒక బండరాయి అడ్డంవచ్చింది. వీరవర్మ ఆ రాయి అంచు పట్టుకుని దూకే వరకు, ఉపాయశాలి ఐన ధీరసింహుడు అతని కాళ్ళు పట్టుకుని, అతనితోపాటు అవతలి వేపుకి దూకాడు.

అదంతా పచ్చికతో నిండిన ఒక పెద్ద మైదానం. ఆ మైదానంలో వాళిద్దరూ ఒకరి వెనుక ఒకరు పరుగులెత్తుతూవున్నారు.



ధీరసింహుడు ఎన్ని కేకలు వేసినా, అతని స్నేహితుడు పలకనేలేదు. ఇలా మరికొంచెం దూరం వెళ్ళగా, చూస్తూ ఉండగానే అతనిముందు ఒక్క పది గజాల దూరంలో బ్రహ్మాండమైన శబ్దం చేస్తూ, భూమి బ్రద్దలైంది. వీరవర్మ దానిలో పడి మాయమైనాడు. వెంటనే భూమి ఎప్పటిలాగా మూసుకుపోయింది. చూస్తే, భూమి బ్రద్దలైన ఆనవాలు ఏమీ కనపడక, పచ్చికతో మామూలుగానే కప్పబడివున్నది. చేసేది లేక, ధీరసింహుడు పర్వతానికి అవతలపక్కని ఏముందో చూడవద్దామనే ఉద్దేశంతో ఆ దిక్కుకి నడిచివెళ్ళాడు.



కొంతదూరం వెళ్లేటప్పటికి, అతని కాళ్లు పట్టుకుపోసాగినై, కన్నులలోనుంచి మంటలు బయల్దేరినై. అక్కడ భూమి అంతా వేడిగా వుంది. ఒకొక్క రాయి ఒకొక్క పెనంలాగా కాలిపోతున్నది. ఈ వెచ్చదనానికి కారణం ఏమిటా అని అతను ఊహిస్తూ మరికొంచెం దూరం పోయేవరకు, అతని కనులముందు ఒక భయంకరమైన అగ్నినది ప్రవహిస్తున్నది. ఆ నదిలోని మంటలు తరంగాలలాగా లేస్తూ, ఆకాశానికి అంటుతున్నయి.

"ఇటువంటి నది ఎక్కడా చూడలేదే. దీనిని దాటడం ఎలాగా భగవంతుడా!"

అని ధీరసింహుడు తీవ్రంగా యోచిస్తూ ఉండగా, నిప్పుకికూడా కాలని ఒక చిత్రమైన నావ ఒడ్డుకి కొట్టుకువచ్చింది. అతను ధైర్యంతో, ఈ చిత్రమేమిటో చూదామని ఉద్దేశించి, దేముని తలుచుకుని ఆ నావ ఎక్కి కూర్చున్నాడు. కను మూసి తెరిచేటంతలో ధీరసింహుడు ఆ అగ్నినదికి అవతల ఒడ్డు చేరుకొన్నాడు. ఈ సంఘటనకు ఆశ్చర్యపోతూ, అతను మళ్ళీ ఆనందంగా నడక సాగించాడు.

కొంతదూరం పోయేటప్పటికి, అక్కడి భూమి అంతా ధగధగ వెండిలా మెరిసిపోతున్నది. అక్కడ ఒక నది ప్రవహిస్తున్నది. అందులో నీరు తెల్లగా వెండిలాగా ఉంది. ఈ నీరు తాగటానికి పనికివస్తుందేమోనని, ధీరసింహుడు నదిలో చెయి ముంచేసరికి, ఆ చెయి కాస్తా వెండిదై పోయింది.

ఇంతలో ఆ నదిలోనుంచి ఒక నావ రాగా దానిలో ఎక్కి కూర్చున్నాడు, సాహసుడైన ధీరసింహుడు. ఆ నావలో మనుష్యులెవళ్ళూ లేరుకాని, ఒక గిన్నెలో దివ్యమైన భోజనమూ, లోటాతో మంచినీళ్ళుమాత్రం అమర్చివున్నాయి. ఆకలి వేస్తున్నప్పటికీ,

అతను 'ఇవి ఎవరికోసమో, మనమెందుకు తాకాలె' అని తలిచి ఊరుకొన్నాడు. అతను అలా సంశయిస్తూఉండగా, నదిలోని చేప ఒకటి తల బయటికి పెట్టి, "ధీరసింహా! ఇవి నీకోసమే, తీసుకో" అని చెప్పేసరికల్లా అతను అకలిదప్పులు తీర్చుకుని, విశ్రాంతి కోసం ఒక్కక్షణం పడుకొన్నాడు. తరువాత మెలకువవచ్చి అతను కళ్లు విప్పేటప్పటికి, మునపటిలాగానే అవతలి ఒడ్డున ఉన్నాడు. ఈసంఘటనలన్నీ దైవికములే అని నమ్మి, ధీరసింహుడు మళ్లీ సహజమైన ఉత్సాహంతో నడిచిపోకొచ్చాడు.



మరికొంచెం దూరం అతను సాగిపోగా అక్కడి భూమి అంతా పన్నెండో వన్నె బంగారంలాగా తళతళ మెరిసిపోతున్నది. అక్కడ, నేలమీద నవరత్నాలూ, రకరకాల మణులూ కుప్పలుకుప్పలుగా పోసివున్నై. ఆ రత్నాలలో ఒక్కొకటి ఒక్కొక్క రాజ్యం ఖరీదు చేస్తుంది. ధీరసింహుడు ఈ రత్నాలను పంచెలో పట్టినన్ని మూట కట్టుకొన్నాడు.

కాని, ఇంతలో "ఓయి ధీరసింహా!— అందులో ఆరు రత్నాలనుమాత్రం నీ వద్ద ఉంచుకో. తక్కినవాటిని పారవేయి. ఈ రత్నాలు మానవులకొరకు కాదు. లోభించినావంటే కీడు మూడుతుంది సుమా!" అంటూ ఒక వాణి పలికింది. ఆప్రకారం అతను ఆరు రత్నాలుమటుకి అట్టే పెట్టుకుని తక్కినవన్నీ విసిరిపారవేశాడు.

ఈ రత్నాలు పట్టుకుని ధీరసింహుడు అలా కొంతదూరం పోయేవరకు, అతని ఎదుట ఒక విచిత్రమైన నది ప్రవహిస్తున్నది. అందులోని జలమంతా బంగారపు జలమే. ఈ వింత ఏమిటా అని అతను అలా ఆలోచిస్తూవుండగా ఒక బంగారు నావ ఒడ్డుకి వచ్చింది. అందులో ఎక్కి ఇదివరకులాగానే నదిని దాటి కొంతదూరం

నడపగా మరిఒక నది కనిపించింది. తీరా చూడగా, ఈ నదిలో నీళ్ళు మామూలు మంచినీళ్ళే. ఈనీటిలో అతను చేతులు కడుక్కునేసరికి, ఇదివరకు వెండివిగా మారిపోయిన ధీరసింహుని చేయి మామూలుగా వచ్చేసింది. కాని, గోళ్ళుమాత్రం వెండివిగానే ఉండిపోయినై.

తరువాత అతను ఒక అడవిదాటి, మళ్లీ ఒక గ్రామం చేరుకున్నాడు. ఆ గ్రామస్థుల్ని కనుక్కోగా, సులోచన ఉండే పట్టణం అక్కడికి చాలా దగ్గర అని తెలియ వచ్చింది. అప్పుడు ధీరసింహుడు దారి తెలుసుకుని, కౌశాంబీనగరం చేరుకుని సులోచన భవనానికి వెళ్లాడు. ధీరసింహుడు వచ్చిన సంగతి తెలియగానే, సులోచన అతనిని ఆదరించి, కూర్చోపెట్టింది.

అతను, శబ్దభేది పర్వతాన్నిగురించి తను తెలుసుకువచ్చిన వివరాలన్నీ విప్పి చెప్పాడు. ఆ పర్వతం అవతల ఏమిటున్నదో, తను ఏమేమి వింతలూ విడ్డూరాలూ చూచాడో, అవన్నీ వెల్లడించాడు. నిదర్శనంగా అతను చేతపట్టుకువచ్చిన అరు రత్నాలూ ఆమెకు చూపించాడు. వెండినదిలో తన చేయి ముంచగా, వెండివిగా మారిపోయిన చేతిగోళ్ళు కూడా చూపించాడు.

అవన్నీచూచి "ధీరసింహా!—నీమాటలన్నీ అక్షరాలా నిజం. నేను నిన్ను పూర్తిగా నమ్మాను. నీ ప్రజ్ఞలకు సంతోషించాను. నీవు నిజంగా అసాధ్యుడవు గనుకనే, నా అసాధ్యమైన ప్రశ్నలకు జవాబు చెప్పగలిగావు. ఈ లోకంలో నిన్ను మించిన సాహసుడు, గుణవంతుడు, యుక్తిపరుడూ మరొకడు లేడు" అంటూ అతనిని మెచ్చుకొన్నది సులోచన.

తరువాత ఊరి పెద్దల ఏర్పాటుప్రకారం, సులోచన, ధీరసింహులకు వివాహమై, వారుహాయిగా ఉంటున్నారు. (ఐపోయింది)






పూర్వకాలమందు దుందుభి అనే రాక్షసుడు ఉండేవాడు. వానిది ఎనుబోతు స్వరూపము. దుందుభికి దెబ్బలాట అంటే సరదా. అందువేత, ఎల్లప్పుడూ ఎవరితో కయ్యానికి కాలు దువ్వటమా అని ఆలోచిస్తూ ఉండేవాడు.

ఒకనాడు వాడు సముద్రునివద్దకుపోయి, "సాగర మహారాజా! పంచ భూతాలలోనూ ఒకడవైన నీవు మహాగంభీరుడవని గర్విస్తూ ఉంటావే! నిజంగా నీవు వీరుడవైతే నాతో యుద్ధంచేసి నన్ను జయించు చూదాం" అంటూ సవాలు చేశాడు.

అందుకు సముద్రుడు "నీతో యుద్ధం చేయటానికి నాకు తీరికలేదు. తగిన సామర్థ్యమూ లేదు. హిమవంతునివద్దకు వెళ్ళావంటే నీ కోరికతీరుతుంది" అని చెప్పాడు.

దుందుభి వెంటనే హిమవంతుని దగ్గరకుపోయి, నోటిమాటలతో యుద్ధానికి రమ్మనటం వీరలక్షణం కాదని తలచి, కొమ్ములతో శిఖరాలను పొడవ జొచ్చాడు. కొన శిఖరంమీద నున్న హిమవంతుడు అదిచూచి, "ఎందుకయ్యా ఇలా నన్ను కొమ్ములతో కుమ్ముతున్నావు? నీ వుద్దేశం ఏమిటి?" అని అడిగేసరికి, "నీవు మహా వీరుడవని సముద్రుడు చెప్పాడు. పౌరుష ముంటే నాతో యుద్ధంచేసి గెలువు" మంటూ తొడ కొట్టాడు దుందుభి.

అప్పుడు హిమవంతుడు వానితో "అయ్యో సముద్రుడు పొరపడ్డాడు. నేను వీరుడ నన్నమాట నిజమే. కాని, నిన్ను ఎదిరించలేను. తారతమ్యం తెలుసుకోకుండా దుడుంగుమని గాలం వేసే వాణ్ణి కాను నేను. ఇంతకూ నీతో యుద్ధం చేస్తూ కూచోటానికి నాకు తీరిక లేదు. ఏమీ అంటే— అనేకమంది మునులు నా సాన్నిధ్యాన్నిచేరి నన్ను ఆనందింపజేస్తూ

డి. పద్మావతి, తాడేపల్లిగూడెం



వుంటారు. వారు శాంతిప్రియులు. వారికి ఇటువంటి యుద్ధాలు గిట్టవు" అన్నాడు.

అప్పుడు దుందుభి "ఏమిటయ్యా హిమవంతుడా!—నీళ్ళు నములుతావేం? అప్పుడు నేను ఎవరో ఒక వీరుణ్ణి యుద్ధంలో జయించిగాని ఇంటికి వెళ్ళను" అని భీష్మించాడు.

వాని ఉత్సాహం గమనించిన హిమవంతుడు "ఓయి వీరుడా!—వానర చక్రవర్తి ఐనటువంటి వాలిని ఎరుగుదువు కదా? అతనికి సాటి వీరులు ముల్లోకాలలోనూ లేరు. నీవుపోయి అతన్ని పిలిచావంటే నీ సరదా తీరుతుంది" అనేసరికి,

"సరే నాయనా! నీవు యుద్ధంచేయకపోతే పోయావ్. మరొకణ్ణి చూపించావు. అదే పదివేలు" అని సంతోషిస్తూ, దుందుభి వాలి ఉండే కిష్కింధ చేరుకొన్నాడు.

దుందుభి చేరుకునేసరికి అర్ధరాత్రి కావటంచేత వాలి మంచి గాఢనిద్రలో ఉన్నాడు. ఉరుములవంటి అరపులతో దుందుభి అల్లరిచేయగా వాలికి మెలకువ వచ్చి "ఏయి దుందుభీ! నీ సంగతి నాకు తెలును. అర్ధరాత్రివేళ వచ్చి ఎందుకిట్లా బొబ్బలు పెడతావు? పో ఫో. ప్రథమ తప్పిదంగా నిన్ను క్షమించి విడిచిపెట్టుతున్నాను" అన్నాడు.

దుందుభి నవ్వుతూ, "నీవు నన్ను ప్రథమతప్పిదంగా విడిచిపెట్టనక్కరలేదు. నిన్ను యుద్ధంలో జయించటానికే ఇప్పుడు నేనువచ్చాను. కనుక, నిన్నే నేను విడిచిపెట్టుతున్నాను. ఇదే నీకు ఆఖరు రాత్రి. ఈ రాత్రి అంతఃపురంలో హాయిగా నిద్రించి, రేపటిరోజున నాతో పోరుసల్పటానికి సిద్ధంగా ఉండవలసింది. మళ్ళీ పొద్దున్నే వస్తాను" అంటూ గర్జించి వెళ్లిపోయాడు.

ఉదయాన్నేవచ్చి దుందుభి మళ్ళీ సింహనాదంచేశాడు. అప్పుడు వాలి



దుందుభితో "ఏమిరా నీ కింకా జ్ఞానం కలగలేదా? నాతో యుద్ధానికే నిశ్చయించుకున్నావా? నీతో యుద్ధంచేయుటం నావంటి వానికి చాలా గౌరవం తక్కువ. ఐనా, నీ పీడ తొలగించడం లోకానికి క్షేమకరమనే ఉద్దేశంతో ఒప్పుకొంటున్నాను" అని చెబుతూ, ఒక్క క్షణంలో యుద్ధానికి సిద్ధమై వచ్చాడు.

తక్షణమే ఇద్దరూ కలియబడ్డారు. కాని దుందుభి చావటానికి, వాడు ఉత్సాహపడినంతసేపయినా పట్టలేదు. వాలి జయధ్వానం చేసుకొంటూ దుందుభి కళేబరాన్ని బలంకొద్దీ కాలితో ఎగురదన్నాడు.

ఆ కళేబరం సరాసరి పోయి మతంగ మహర్షి ఉండే ఋష్యమూక పర్వతంపైన పడి, దుందుభి ముక్కులనుండీ నోటినుండీ వచ్చే రక్తధారలతో ఆ పర్వతమంతా తడిసిపోయింది.

ఇదంతా దివ్యదృష్టివలన తెలిసికొన్న మతంగ మహర్షి కోపగించి, "ఇటువంటి అకార్యంచేసిన వాలి ఎప్పుడైనా ఈ పర్వతం మీదికి వచ్చినట్టయితే తలపగిలి చస్తా"డని శపించాడు. ఈ సంగతి భటులవలన విని, వాలి వెంటనే మతంగునివద్దకు వెళ్ళి "మహానుభావా!- తెలియక చేశాను తప్పు, క్షమించండి" అని బతిమాలాడు. కాని అందుకు ఋషి "ఓరి అబ్బాయీ!- నిప్పు తెలిసి తాకినా కాలుతుంది, తెలియక తాకినా కాలుతుంది. నా మాటకు తిరుగు లేదు. అనుభవించవలిసిందే, పో!" అని చెప్పి పంపించివేశాడు.

ఆ శాపభయంవల్ల వాలి తన జీవితంలో మరెన్నడూ ఋష్యమూకానికి పోనేలేకట. ఎంతటి వీరుడూ శూరుడూ ధైర్యశాలీ ఐనా, వాలివంటివాడు సైతం ఋషిశాపానికి లొంగిపోవలసివచ్చింది.

# జీవితం అంటే....

ఒక పేదవారికి యిద్దరు కొడుకులు. వాళ్లకు ఏవిధమైన ఆస్కారమూ లేకపోవటంచేత, ఇద్దరిలోనూ ఎవరో ఒకరు కష్టపడి సంపాదించుకువచ్చి, కుటుంబాన్ని పోషించవలసిఉండేది.

ఇలా ఉండగా, వారిలో పెద్దవాడు ఒక రోజున పనికోసం బయల్దేరాడు. దారిలో ఒక వృద్ధుడు అతనికి కనపడి "అబ్బాయీ, ఇలా ఎంతవరకు వెళుతున్నావు?" అని అడిగాడు. అందుకు ఆ కుర్రవాడు "ఏదైనా పని చూచుకొని డబ్బు సంపాదించాలని బయల్దేరాను" అన్నాడు. వృద్ధుడు అతనిని తన గొర్రెలమందను కాయటానికి పనిలో పెట్టుకున్నాడు.

మరునాడు అతనితో వృద్ధుడు "అబ్బాయీ!—నీవు ఈ గొర్రెలవెంట వెళ్లి, మళ్లీ వాటివెంట ఇంటికి వచ్చేసెయ్యి. అవి ఎక్కడకు పోతే అక్కడికి వెళ్ళటమేగాని, నీ అంతట నీవు వాటిని ఏ ప్రదేశానికీ తోలవద్దుసుమా!" అంటూ చెప్పి పంపాడు.

ఆ ప్రకారం అతను గొర్రెలమంద వెంట బయల్దేరాడు. అవి ముందుగా ఒక చక్కటి గొప్ప మైదానం చేరుకున్నాయి. ఆ తరువాత జోరుగా ప్రవహించే ఒక యేరు అడ్డురాగా, గొర్రెలు అవలీలగా ఏరు ఈదుకొని పోయినై. కాని కుర్రవాడు మాత్రం ఏరు దాటలేక, ఆ గట్టునే నిలిచి పోయాడు. పొద్దు గుంకేసరికల్లా మందలో గొర్రెలన్నీ ఏరు దాటుకొని బిలబిలమంటూ వచ్చేసి ఇల్లు చేరుకున్నై. వాటి వెనకనే కుర్రవాడు ఇల్లు చేరుకోగానే, వృద్ధుడు "అబ్బాయి! గొర్రెలవెంట నీవు ఎక్కడెక్కడికి పోయివచ్చావు?" అని అడిగాడు.

అందుకు కుర్రవాడు "బాబాయ్! అవి ముందుగా ఒక చక్కటి గొప్ప మైదానం చేరుకున్నై. ఆతరువాత జోరుగా ప్రవహించే

హెచ్. వి. రమణి, గుంటూరు

యేరు దాటి పోయినై. నేను ఆ యేరు దాటలేక, ఒడ్డునే నిలిచిపోయాను" అని చెప్పేసరికి, ముసలివాడు కోపగించి. "నీవు నా పనిలోకి పనికి రావు. తిరిగి యింటికి పో" అని పంపివేశాడు.

కుర్రవాడు విచారంతో ఇంటికి పోయి సంగతులన్నీ చెప్పేటప్పటికి రెండవవాడు "అన్నా. అన్నా! ఆ పనిలో నేను ప్రవేశిస్తాను" అని చెప్పి బయల్దేరి. తన అన్న కలిసికొన్న వృద్ధునివద్దనే ఒక ఏడాదిపాటు గొర్రెలను కాయటానికి కుదుర్చుకొన్నాడు.



మరునాడు వృద్ధుడు 'అబ్బాయీ! నీవు ఈ గొర్రెలవెంట వెళ్లి మళ్లీ వాటివెంట ఇంటికి వచ్చెసెయి. అవి ఎక్కడకు పోతే అక్కడకు వెళ్లటమేగాని, వాటని ఏ ప్రదేశానికి నీ అంతట నీవు తోలవద్దు సుమా' అని చెప్పి పంపాడు.

గొర్రెలు నెమ్మదిగా నడిచి పోయి, ఒక పచ్చటి గొప్ప మైదానం చేరుకొన్నాయి. కుర్రవాడు అడుగులో అడుగు వేసికొంటూ వాటి వెంబడే వెళ్లబొచ్చాడు. ఆ తరువాత అవి జోరుగా ప్రవహించే ఏరు దాటనై. కుర్రవాడు ఏటిలో దిగి అవతలిగట్టు చేరుకొనేసరికి, అలిసి మూర్ఛపోయాడు.

అప్పుడు ముందుకు పోతున్న గొర్రెలు ఒక్కసారి వెనక్కి తిరిగి, అతనిమీద ముక్కులతో పూడేసరికి, ఆ కుర్రవాడు మళ్లీ స్పృహ గలిగి మునపటికంటే ఎక్కువ శక్తితో గొర్రెల వెంట పోసాగాడు. ఆటుతరువాత గొర్రెలు మరివక బ్రహ్మాండమైన మైదానం చేరుకున్నాయి. ఇక్కడి గడ్డి చెయెత్తున ఉన్నప్పటికీ, ఈ గడ్డి మేస్తున్న పశువులు మాత్రం గాలి వేస్తే ఎగిరిపోయేలాగ బక్క చిక్కి ఉన్నాయి.

అక్కడినించి ఆ గొర్రెలుపోయి ఇంకొక మైదానం చేరుకున్నై. ఇక్కడ తినటానికి తగిన పచ్చగడ్డి లెనేలేదు. అయినప్పటికీ,



ఈ ప్రదేశంలో పశువులు వెన్నలాగా నవ నవ లాడుతూ కనపడినై.

ఇక్కడినుంచి గొర్రెలు ఒక గొప్ప తోట లోకి పోయినై. ఈ తోటలో నేటిలోనించి మంటలు గక్కుతూవున్న రెండు కుక్కలు భయంకరంగా పోట్లాడుకొంటున్నాయి.

అక్కడినించి గొర్రెలు పోయి పోయి, ఒక విశాలమైన సరోవరం వద్ద నిలబడినై. ఆ సరోవరంలో ఒకామె చెంచా చేత పట్టుకొని దేనికోసమో దేవులున్నది.

మరికొంచెం దూరం పోయేసరికి, ఒక అందమైన ఉద్యానవనం కనపడింది. అందులో, రకరకాల పుష్పజాతులు అన్నివున్నైన్నై. కుర్రవాడు ఒక పువ్వులచెట్టు కింద విశ్రాంతికోసం కూర్చున్నాడు. అప్పుడు అక్కడికి ఒకతెల్లటి పావురం రాగా తనవద్ద నున్న ఉండిల్లిబద్దతో దానిని కొట్టాడు. ఆ దెబ్బకు దాని ఈకమాత్రం ఒకటి రాలింది, పావురం పారిపోయింది. సరే, ఎందుకైనా మంచిదని, వాడు ఆ యీకను తీసి జాగర్తగా తనసంచీలో వేసుకున్నాడు.

అక్కడనించి గొర్రెలు తిరిగి ఇంటి ముఖం పట్టినై. కుర్రవాడు కూడా గొర్రెల వెంట ఇంటికి చేరుకోగానే, వృద్ధుడు

"అబ్బాయీ! గొర్రెలు నిన్ను చిక్కు పెట్ట లేదుకదా?" అని అడిగాడు. కుర్రవాడు తాను చూచిన చిత్రాలన్నీ చెప్పాడు.

"అబ్బాయీ! నీవు గొర్రెలతో కూడా వెళ్లి మొట్టమొదట చూచిన అద్భుతమైన చక్కటి, పచ్చటి మైదానము ఏమిటో తెలుసా? అది నీవు ఇప్పటివరకూ గడపిన యౌవన జీవితం. అక్కడనించి పోయి నీ పాపాలను కడిగివేసే 'ప్రాణజలం' ప్రవహించే నదిలో పడినావు. అందులో పడగానే నీ పాపాలన్నీ పరిహారమైనాయి, అవతలి ఒడ్డు చేరుకన్న తరువాత గొర్రెలు నిన్ను ఊదగానే నీ ఆత్మ పవిత్రమైంది. నిన్ను ఊది, పవిత్రం చేసిన గొర్రెలే మోక్షమిచ్చే దేవతలు, నీకు సద్గురువులు.

"చేయెత్తు గడ్డిగల మైదానంలో మేస్తూ వున్నప్పటికీ, బలహీనంగా ఉన్న ఆ పశువు లేమిటో తెలుసా? తాము తినలేక, ఒకరికి పెట్టలేక ధనం కూడబెట్టే లోభులు. తిండి పుష్కలంగా ఉన్నప్పటికీ, అటువంటి లోభులు ఆకలి దప్పులతో బాధపడుతూ ఉండవలసిందే.

"తరువాత నీవు చేరిన మైదానంలో ఏమీ తినటానికి లేకున్నా, అక్కడి పశువులు







నవనవలాడుతూ ఆనందంగా ఉన్నాయి కదూ? కలిగినదానిలో కాస్తంత పేదకూ సాదకూ రాల్చే పుణ్యాత్ములు ఈ జన్మలో ఆనందంగా ఉంటారు. వీళ్ళకు ఉన్నా లేకపోయినా ఒకటే తృప్తి.

"పోతే, ఆస్తులకోసం, పంపకాలు తెగక కొట్లాడుకునే అన్నాదమ్ములు కుక్కజన్మ ఎత్తి, అలా కొట్లాడుకుంటూనే వుంటారు.

"ఇక సరోవరంలో చెంచా చేతపట్టుకొని వెతుకుతున్న ఆ యిల్లాలు ఎవరనుకున్నావు? పాలలో నీళ్ళు కలిపి వర్తకం చేసిన మనిషి. ఆమె కలిపిన పాలూ నీళ్లూ విడదీద్దామని అలా ప్రయత్నిస్తూనే వుంటుంది. కాని, ఎప్పటికీ విడదీయలేదు.

"చిట్టచివర నీవు చూచిన ఉద్యానవనమే స్వర్గం. పుణ్యం చేసుకున్న వాళ్లే అక్కడికి వెళతారు. నీవు ఆ స్వర్గానికి పోయి వచ్చినట్టుగా ఏదైనా ఆనవాలు చూపించగలవా?" అని అడిగాడు వృద్ధుడు.

వెంటనే కుర్రవాడు తన దగ్గరవున్న పావురపు ఈకను తీసి యిచ్చాడు.

వృద్ధుడు "ఆ తెల్ల పావురాన్ని నేనే. నీవు ఏమి చేస్తావోనని, ఈ రూపంలో నీవెంట ఉండి, నేను కని పెడుతూ నేవున్నాను. దేవుడు కూడా ప్రతి మానవుని వెంట ఉంటూ, ఒక్కొక్కడు చేసే పనులను పరిశీలిస్తూవుంటాడు. నీవు పిట్టను కొట్టగా కింద రాలినది ఏమిటనుకొంటున్నావు! నా చేతి చిటికెనవేలు రాలిపోయింది. చూడు" అంటూ, తన చేయి చూపించాడు,

తర్వాత వృద్ధుడు కుర్రవానితో "జీవితమంటే ఏమిటో తెలిసింది కనుక ఇప్పుడు నువ్వు నేర్చుకున్న విషయాలు గుర్తుంచుకుని హాయిగా జీవించు. నీకు ఎటువంటి కష్టాలూ రాకుండా దీవిస్తున్నాను" అన్నాడు.

కుర్రవాడు వృద్ధునికి నమస్కరించి, ఇంటికి చేరుకొని, తల్లినీ అన్ననూ పోషిస్తూ, సుఖంగా ఉన్నాడు.



# కామరాజు గేదెలు-భీమరాజు పాదులు

కాతేరు గ్రామంలో కామరాజు అనే కరణాల పిల్లవాడొకడు ఉండేవాడు. చిన్నప్పుడే తండ్రిపోయినందువల్ల చదువు సంధ్యలు ఏమీ అబ్బలేదు. వాడి తల్లి గవరమ్మ "చదువుకోరా నాయనా. చదువు కుంటే నీకు మంచి ఉద్యోగం వస్తుందిరా" అని బతిమాలేది.

"ఉద్యోగమా అమ్మా? ఏం ఉద్యోగం వస్తుందే?" అని అడిగాడు కామరాజు.

కామరాజు అలా అడిగేటప్పటికి బితంపూడి గ్రామంలో ఆవిడ అన్న బిన హనుమాన్లు చేస్తూవున్న ఉద్యోగం జ్ఞాపకం వచ్చిందావిడకు. ఆ ఉద్యోగం పేరేమిటో ఆవిడకు తెలియదుగాని, అదేదో చాలా గొప్ప ఉద్యోగమనే ఆవిడ అనుకుంది. ఏమీ అంటే, హనుమాన్లుగారింటికి ఆయన ఉద్యోగం ధర్మమా అంటూ కాయకూరలూ, కందులూ, పెసలూ, మినుగులూ, ఇంకా ఏవేవో సరుకులూ ఊరికేనే వచ్చి పడుతేండేవి. చుట్టుపక్క రైతులంతా బళ్ళమీద గడ్డిబొద్దులు తెచ్చిపడేసి పెరట్లో మేట్లు వేసిపోతూండేవారు. అంత గడ్డి ఊరికే వచ్చిపడుతోంది గనకనే ఆయన ఐదు పాడిగేదెలను కొన్నాడు.

అవన్నీ జ్ఞాపకం వచ్చి గవరమ్మ కొడుకుతో, "హనుమాన్లుమామయ్య చేసే బితంపూడి ఉద్యోగంలాంటి ఉద్యోగం నీకూ్కడా వస్తుందిరా నాయనా. మామయ్య ఐదు గొడగేదెలను కొన్నాడు. వాళ్ళింట్లో రోజూ మూడుపూట్లా గడ్డపెరుగు వేసుకు జుర్రుతారు తెలుసా? నువ్వుకూడా మామయ్యకు మల్లే చదువుకుని అలాంటి ఉద్యోగం చేస్తివా, అతనికి మల్లేనే ఐదు గేదెలనూ కొనుక్కుని మేపుకోవచ్చు. రోజూ కమ్మటి గడ్డపెరుగు వేసుకుని జుర్రి వచ్చు!" అంది.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మద్రాసు




'గడ్డపెరుగు' అనటంతోనే కామరాజుకి నోరు ఊరింది! "అదైతే నేను తప్పకుండా చదువుకుని ఐతంపూడి ఉద్యోగం చేస్తానే అమ్మా. ఐదు గేదెలనూ కొంటానే!" అంటూ వాడు ఆరోజునుంచీ బళ్ళోకి వెళ్ళటం మొదలెట్టేడు.

బళ్ళోకి వెళ్ళేవాడుగాని, వాడి ధ్యానం మాత్రం మేష్టరు చెప్పే పాఠంమీద ఉండక, ఐతంపూడి ఉద్యోగమయాక తాను కొనబోయే గొడ్గేదెల గడ్డపెరుగు మీదనే ఉండేది. ధ్యానం మరోచోట ఉండటంచేత ఎన్నేళ్ళు బళ్ళోకి వెళ్ళినా కామరాజుకి చదువురాలేదు. ఐతంపూడి ఉద్యోగం చేసేటంత చదువు కాదుకదా, చేవ్రాలు చేసేపాటి చదువైనా అబ్బలేదు.

తన కొడుకు ఇలా బడుద్దాయి ఐపోయాడని గవరమ్మ విచారించి, 'వీణ్ణి దారికి తీసుకురావటం ఎలాగా?' అని శతవిధాల ఆలోచించింది. 'వీడికి పెళ్లి చేసేస్తే సరి! అప్పుడు భార్యను పోషించవలసిన బాధ్యత నెత్తిమీద పడి, సంపాదించుకోవాలన్న యావ ఒక్కమాటుగా పుట్టుకువస్తుంది" అని తోచింది. ఈ ఆలోచన తట్టటంతోనే గవరమ్మగారు నిద్రాహారాలు మానేసి పెళ్ళి సంబంధాలు వెతకసాగింది.

తిరిగి తిరిగి ఆఖరికి తామరాడ కరణంగారి కూతురు 'అమ్మన్న' అనే పిల్లను నిశ్చయంచేసుకు వచ్చింది.

'కామరాజుకి మరెవరూ పిల్ల నివ్వనప్పుడు అమ్మన్న తండ్రి మాత్రం ఎందుకు ఇచ్చాడూ?' అని మీరు అడగవచ్చు. అమ్మన్న ఉత్తి వెట్టిమాలోకం. దానికెక్కడా పెళ్ళి సంబంధాలు రాకనే కరణంగారు, కామరాజు సంబంధం వచ్చి రావటంతో పెళ్ళి నిశ్చయం చేసేశాడు. నిశ్చయమైన వారానికే ముహూర్తం పెట్టించి పెళ్ళి చేసేశాడు.



పెళ్ళాం కావరానికొస్తే, కొడుక్కి బాధ్యత తెలిసొచ్చి, సంపాదన మొద లెడతాడనికదా గవరమ్మ కామరాజుకి పెళ్ళిచేస్తే? కామరాజు సంపాదన లేదు సరికదా, 'పెళ్ళి ఐ ఒక యింటివాణ్ణి అయ్యాను గనక నేనూ గొప్పవాణ్ణే' అనుకుని ఇంట్లో కర్రపెత్తనం మొదలెట్టేడు. తల్లి మీద సాము చేయటం ఉంతనేవున్నది. ఇప్పుడు కొత్తగా పెళ్ళాంమీదకూడా అధికారం చెలాయించడం మొదలెట్టేడు.

మొగుడు కేకలు వేస్తూన్నప్పుడు, తెలివైన పెళ్ళాం అవుతే మాటకు మాట సమాధానం చెప్పకుండా ఊరుకుంటుంది. కాని అమ్మన్న కుంఢ బద్దలు గొట్టినట్లు, తనకు తోచినదేదో నిర్మొగమాటంగా చెప్పేసేది. 'హు త్తేరీ, నాకు బుదులు చెపుతావా?' అంటూ, ఆ మూర్ఖశిరోమణి ఆమె శిగ పట్టుకుని బాదుతుండేవాడు.

ఇలా ఉండగా ఒకనాడు బతంపూడి నుంచి గవరమ్మగారింటికి ఒక శుభలేఖ వచ్చింది. హనుమాన్లుగారు రాశిన శుభలేఖ అది. ఆయన కొడుకు వీరభద్రుడికి పెళ్లట! చెల్లెలు విని సంతోషిస్తుందని హనుమాన్లు గారు ఆ పసుపుబొట్ల కార్డులో కట్నం



కానుకల వివరాలు కూడా రాశాడు. వీరభద్రుడికి రెండువేల రూపాయిల కట్నంట! కట్నం సంగతి తెలిసి గవరమ్మ గారు సంతోషించిందిగాని క్రమంగా ఆ సంతోషమంతా అసూయగా మారింది.

కామరాజును చూసి ఆవిడ, 'ఎందుకూ వాజమ్మవు! ఒక్క దమ్మిడీఐనా కట్నం సంపాదించలేక పోయావుకదా నువు? ఎలా సంపాదిస్తావ్? చదువు ఉంటేగా? వీరభద్రు డంటే చదువూ సంధ్యా ఉన్నవాడు. వాళ్ల నాన్నకు మల్లేనే వాడుకూడా పెద్ద ఉద్యోగం చేస్తాడు! కట్నం ఇచ్చారంటే అబ్బురం ఏముంది?' అని తన బాధ వెళ్లబోసుకుంది.





కామరాజుకు అలాటి అసూయా, బాధా లేకుగాని ఆ శుభలేఖతో ఒక్కమాటు ఐతంపూడి ఉద్యోగం, ఐదు గేదెల పాడీ, కమ్మటి గడ్డపెరుగూ జ్ఞాపకాని కొచ్చాయి. ఆ ఉద్యోగం ఎలాగైనా సంపాదించి, గేదెల్ని కొని, పెరుగు జుఱ్ఱుకోవాలన్న కోరిక మళ్ళీ ఒకమాటు కలిగిందతనికి. అదే సమయానికి ఎంత పెడదామని అమ్మన్న పట్టుకువెడుతూ ఉన్న పెద్ద ఊరగాయ బాన, అతని కంట బడింది. తను గేదెల్ని కొంటే, ఆ పాలన్నీ కాచటానికి అమాత్రం కుండఐనా ఉండాలె అనిపించింది కామరాజుకి. దానికి సరిపడ్డ పెద్ద దాలిపేసి, అంత కుండతోటీ తన భార్య పాలుకాస్తుంది అనుకున్నాడతను. వెంటనే మరొక్క ఆలోచన వచ్చిందతనికి. ఐదు గేదెల పాడీ తన పెళ్ళాం చేతిమీదకదా నడుస్తుంది! తన భార్యకు పుట్టింటి వాళ్ళంటే తగని అభిమానం, ముక్కువా కదా! అంచేత, అది వెన్న అంతా కూడబెట్టి నెయ్యికాచి, ఆ నెయ్యి అంతా తామరాడ పంపించెయ్యదుకద?— ఇదీ ఆతనికి పట్టుకున్న బాధ. ఆ సంగతేమిటో అప్పుడే తెల్సుకోవాలని తోచి కామరాజు అమ్మన్నని నిలుచున్న పటాన్న రమ్మన్నాడు. ఆ అమ్మాయి వచ్చి,

"ఎందుకు?" అని అడిగింది.

"నాకు ఐతంపూడి ఉద్యోగం ఐతే గియితే, నువ్వు ఐదు గేదెల పాడి చేస్తే గిస్తే, మా వాళ్ళకి పోస్తావా మీ వాళ్ళకి పోస్తావా?" అని అడిగాడు కామరాజు.

"మీ వాళ్ళకెందుకు పోస్తాను? మా వాళ్ళకే పోస్తాను!" అన్నది అమ్మన్న.

ఆ మాట వినేటప్పటికి కామరాజుకి ఒళ్ళు మండిపోయింది. ఉబ్బెత్తుగా లేచి వెళ్ళి, "మీ వాళ్ళకే పోస్తావేం? మీ వాళ్ళకే పోస్తావేం?" అని పళ్లుకొరుకుతూ,

అమ్మన్నను తెగ బాదడం మొదలెట్టేడు. అమ్మన్న చేతిలో ఉన్న ఊరగాయకుండ క్రిందపడి భడీలుమని ముక్క ముక్కలై పోయి ఊరగాయంతా నేలపాలైపోయింది.

అదే సమయానికి వాళ్ళ వీధి తలుపు కూడా భళ్లుమని చప్పుడై తెరుచుకుని చెయ్యెత్తు మనిషి ఒకడు లోపల ప్రవేశించి, పెళ్లాన్ని బాత్తేన్న కామరాజును జుట్టు పట్టుకుని కిందపడేసి, గొడ్డును మోదినట్లు మోదటం మొదలెట్టేడు. ఆ దెబ్బలతో కామరాజు 'చచ్చిపోయానర్రోయ్' అని గోల చేయసాగాడు.

ఆ గలభా విని లోపల్నుంచి గేవరమ్మ గారూ, ప్రక్కింటినుంచి పేరమ్మగారూ, వీధిలోంచి వీరమ్మగారూ పరుగెత్తుకొచ్చి, కామరాజును ఆ వచ్చిన భీమరాజు చేతుల్లోంచి తప్పించారు.

ఆ వచ్చిన భీమరాజు మరెవరోకాదు, అమ్మన్న అన్నగారే. చెల్లెల్ని పండగకు పుట్టింటికి తీసుకువెడదామని తామరాడ నుంచి వచ్చిన కామరాజు బావమరిది.

అక్కడ మూగిన అమ్మలక్కలంతా సంగతేమిటో తెలియక విస్తుపోయి చూస్తోంటే గేవరమ్మే ఆఖరికి భీమరాజు నడిగింది,




"ఏం భీమరాజూ, కామరాజును అలా బాదేశావ్?" అని. "వీడు మా చెల్లెల్ని ఎందుకు బాత్తున్నాడో కనుక్కోండిముందు" అన్నాడు భీమరాజు. "ఏమిరా నాయనా, ఏమొచ్చిందిరా?" అన్నది తల్లి.

"ఇంతకంటే ఏం రావాలె అమ్మా? గేదెలపాడి అంతా తన వాళ్ళకేగాని మన వాళ్ళకి పొయ్యేదుట! ఇలా అన్నదాన్ని కొట్టాలా చీల్చెయ్యాలా?" అన్నాడు కామరాజు పళ్లు కొరుకుతూ.

ఆ మాట విన్న పేరమ్మగారు, "గేదెల పాడి అంటావేమిటి కామరాజూ? మీకు గేదె లెక్కడివి?" అని అడిగింది. "ఎక్కడి

వేమిటమ్మా, కొంటాను." అన్నాడు కామరాజు తడుముకోకుండా. "ఎలా కొంటావ్? కొని ఎలా భరిస్తావ్? అని అడిగింది పేరమ్మ.

"ఎలాగేమిటి? ఐతంపూడి ఉద్యోగం వస్తే కావలసినంత డబ్బూ, కావలసినంత గడ్డిని ఆ డబ్బుతో గేదెలను కొని ఆ గడ్డితో మేపుకుంటాము" అన్నాడు కామరాజు.

"ఏడిసినట్లే ఉంది నీ తెలివి?" అంటూ పేరమ్మగారు బుగ్గని వేలెట్టుకుంది.

తల్లి ప్రాణం గనక గవరమ్మగారికి ఉక్రోషం వచ్చి, "తెలివితక్కువ వాజమ్మ గనకనే బావమరిదిచేత చావు దెబ్బలు తిన్నాడు. మొగుళ్లు పెళ్ళాలని కొట్టుకోడం ఉండిగాని, బావమరదులొచ్చి బావలను కొట్టడం ఎక్కడైనా ఉందా?" అంది.

అప్పుడు భీమరాజు నవ్వుతూ, "ఏవ మ్మోయ్ గవరమ్మత్తా, నేను మా బావని కొట్టింది మా చెల్లెల్ని అతను కొట్టేడని కాదు. మా ఐచ్చలి పాదులు ధ్వంసం అయిపోయాయన్న కోపంకొద్దీ కొట్టేను!" అన్నాడు.

"మీ ఐచ్చలి పాదులా? మీ పాదులు ధ్వంసమైపోతే మావాణ్ణి కొట్టడం ఎందుకు? అంతకూ, మీ యింట ఐచ్చలి పాదులు ఎక్కడున్నాయి?" అని నిలదీసి అడిగింది గవరమ్మ.

"మా యింట్లో కాదుకదా, మా వూళ్లోనే లేవు ఐచ్చలిపాదులు. ఆ నేలమీద ఐచ్చలి ఎడగవనే. ఆ గ్రామంనుంచి మీ ఊరికి మకాం ఎత్తేస్తున్నాను. నేను ఇక్కడ కాపరం పెట్టి, దొడ్డిఅంతా పందిళ్లువేసి, వాకెంతో ఇష్టమైన పెరుగు ఐచ్చలి పాకిస్తాను ఆ పెట్టబోయే ఐచ్చలి పాదులను, నీ కొడుకు కొనబోయే గేదెలు వచ్చి మేసిపోతా యనే వుద్దేశంతో నేను వానిని కొట్టాను" అన్నాడు భీమరాజు యుక్తిగా.

భీమరాజు మాటవిని అందరూ పకపకా నవ్వటం మొదలెట్టేరు.






పూర్వకాలంలో హిరణ్యాక్షుడు అనే రాక్షస రాజు ఉండేవాడు. అతడు ఘోరమైన తపస్సుచేసి, శివునివల్ల అనేకమైన వరములు పొందాడు. వరములు పొంది నప్పటినించీ అందరనూ హింసించ నారంభించాడు. హిరణ్యాక్షుని పేరు చెబితే, ముల్లోకాలలోనూ ప్రాణికోటి హడలిపోతూ వుండేది. వాడు తన దర్పంవల్ల స్వర్గాధిపతి ఐన దేవేంద్రుణ్ణికూడ ధిక్కరించి ఆ సింహాసనం ఆక్రమించాడు.

ఇంత చేసినప్పటికీ వరములిచ్చిన ఈశ్వరుడు సహించి ఊరుకొన్నాడు. కాని, కైలాసంలోని ప్రమథగణాలమీదికే వాడు దాడి వెడలేసరికి పట్టరాని కోపంవచ్చి శివుడు వానిని శపించివేశాడు: "ఓయి హిరణ్యాక్షా!— నా భక్తుడవు కావటంచేత నీవు చేస్తున్న అగడాలన్నిటికీ ఓర్చి ఊరుకొన్నాను. కాని, రోజు రోజుకీ నీవూ నీ కుటుంబమూ చేసే ఘాతుక చర్యలు చాలా ఘోరంగా ఉంటున్నయి. కనుక, మీరు జంతువులైపుట్టి అడవులంట తిరుగు లాడుతూవుండండి" అనేటప్పటికి, రాక్షస రాజు గడగడలాడుతూ పరమేశ్వరునికి సాష్టాంగపడి, 'పొరపాటు క్షమించి, శాపం తప్పించు'మని ప్రార్థించాడు.

అప్పుడు శివుడు దయదలిచి, "శాపం తప్పించటానికి వీలుకాదు. పన్నెండేళ్ళ పాటు ఈ మృగజన్మలో ఉన్న తరువాత, దైవచింత లేని ఒక బోయవాని చేతిలో మీకు మరణం సంభవించబోతుంది. ఆ సమయంలో మీకు పూర్వజన్మస్మృతి కలిగేటట్టు, శాశ్వతమైన ముక్తి పొందేటట్టు అనుగ్రహిస్తున్నాను, పొండి!" అంటూ, అదృశ్యమైనాడు. శివుని శాపంవల్ల హిరణ్యాక్షుడూ, అతని భార్యలూ జింకలుగా పుట్టి, అడవులలో సంచరిస్తూ ఉంటున్నారు.

ముద్దా సోమప్పశాస్త్రి, పరుశువాకం



జింకలు సంచరించే ఆ అరణ్యానికి ప్రతిరోజూ ఒక ఈశ్వరభక్తుడు వచ్చి బిల్వ పత్రాలు కోస్తూ ఉండేవాడు. ఒక్కొక్క పత్రం కోసినప్పుడల్లా 'శివ శివా!' అని స్మరించి, కోసిన పత్రాలన్నీ ఆ చెట్టు కిందనే వెలసినటువంటి 'స్వాయంభువ' లింగానికి పూజచేస్తూ ఉండేవాడు. శాప వశంచేత మృగజన్మ ఎత్తిన జింకలు అతను చేసే పనిని గమనించి తమకు తరణోపాయం దొరికినట్టుగా పొంగిపోయినై.

నాటినించీ అవి స్వాయంభువ లింగం ఉండే స్థలం చక్కగా శ్రద్ధతో బాగుచేసి, మాలిన్యం తొలగించి, భక్తుడు మళ్ళీ



పూజకు వచ్చేవేళకు సిద్ధం చేసిపెట్టేవి. ఈ విధంగా భక్తునితోపాటు, జింకలు కూడా ఈశ్వర సేవ చేస్తూవచ్చాయి.

అదే అడవికి ఒక బోయవాడు కూడా వచ్చాడు. వాడు మామూలు బోయవాడు కాదు. నిష్ఠాపరులైన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించినవాడే కాని కర్మవశంచేత కులభ్రష్టుడై కిరాతకులలో కలసిపోయాడు. ఒక కిరాత కన్యను వివాహం చేసుకుని, వాళ్ల వృత్తినే అవలంబించాడు. దైవచింత, దయాదాక్షిణ్యమూ లేక, ఆ అడవిలో మృగాలను వేటాడుతూ ఉండేవాడు.

ఒకరోజున ఈశ్వరభక్తుడు బిల్వపత్రాలు కోస్తూవుండగా బోయవాడు అడవికి రావటం తటస్థించింది. అతను 'శివ శివా!' అన్నప్పుడల్లా మహాపాపాత్ముడైన ఆ బోయ వాడు "శివశివా! శివశివా!!" అంటూ ఎగతాళిచేస్తూ ఉండేవాడు. నోరు నొచ్చే వరకూ వాడు అతనిని వెక్కిరించి, తన మానాన తను వేటకు వెళ్ళిపోయాడు.

ఎప్పుడు మాటువేసినా బోయవాని వలలో ఏదో ఒక మృగం వెంటనే వచ్చి పడేది. కాని, ఈవేళ చిన్న జంతువైనా పడలేదు. 'ఏమైనా సరే, జంతువు వలలో

పదాలి. ఇక్కడనించి కదలాలి' అనే పట్టుదలతో వాడు చీకటి పడినప్పటికీ అరణ్యం వదలిపోలేదు.

పైగా, పంతం పట్టిన బోయడు ఆ కటిక చీకటిలో ఒక చెట్టు ఎక్కి కూర్చుని, ఆ ఈశ్వరభక్తుడు జ్ఞాపకంరాగా, "శివ శివా!" అని మాటిమాటికీ వెక్కిరిస్తూ ఆ చెట్టు ఆకులు తుంప నారంభించాడు.

ఇంతలో ఆ చెట్టుకిందకు ఒక ఆడు జింక వచ్చి నిలబడేసరికి, విల్లు ఎక్కుపెట్టి దాని నతడు కొట్టబోయాడు. అప్పుడు ఆ జింక వాడికి ఆశ్చర్యం కలిగేటట్టు మానవ భాషలో "ఓయి బోయివాడా!— కిందటి జన్మలో మాది రాకెస కుటుంబం. శాప వశంచేత జింకలుగా పుట్టి అడవులవెంట తిరుగుతున్నాము. ఇప్పుడు నేను నా భర్తను వెతుకబోతున్నాను. అయన అనుమతి పొంది తెల్లవారేలోపల తిరిగి వచ్చేస్తాను. కనుక నన్ను వదిలిపెట్టు" అంటూ ప్రాధేయపడింది. "నోరులేని జింక యేమిటి, ఇలా మాటాడ్డమేమిటి! కానీ— దీని నీతి ఎంతవరకు నిలబడుతుందో చూదాం" అని తలిచి బోయవాడు కాళ్ళ ముందుకు వచ్చిన జింకను విడిచిపెట్టాడు.



ఆడుజింక వెళ్ళిన మరికొంచెంసేపటికే దాని భర్తయిన మగ జింక అక్కడికి రాగా, బోయవాడు దీనిపైకి బాణం ఎక్కుపెట్ట బోయాడు. ఇదికూడా ఆడుజింక చెప్పినట్టే చెప్పి, ప్రమాణాలుచేసి, ఇంటికి పోయింది. ఇంటివద్ద ఆడుజింక బిడ్డను కన్నది. అది బిడ్డనూ భర్తనూ వెంటబెట్టుకువచ్చి, "ఓయీ బోయవాడా!— ఇదుగో, నేనే కాదు, మా కుటుంబమంతా నీకు ఆహారంగా వచ్చాము. ఆరగించు, ఇప్పటికే ఆలస్యమైపోయింది..." అనే సరికి వాని న్యాయవర్తనం చూచి బోయడు చాల ఆశ్చర్యపోయాడు.

ఈలోపల, పూర్వజ్ఞానం కలిగి ఆ జింకలు కడసారి స్వాయంభువ లింగాన్ని శుభ్రపరచి, దానికి భక్తిపూర్వకంగా ప్రదక్షిణం చేసి, బోయవానికి ఎర కావటానికి సిద్ధంగా నిలబడినై.

అప్పుడు బోయవాడు తను చేసిన పాపాలన్నీ తలపోసి దుఃఖించేటప్పటికి, కన్నీరు ధారలుగా ప్రవహించి, చెట్టు దిగువనున్న స్వాయంభువ లింగముపైన పడినయి.

కటికచీకటిలో అతను ఎక్కికూర్చున్నది బిల్వవృక్షము. ఎగతాళికే కావచ్చు, తలవని తలంపుగా ఆ బిల్వపత్రాలు తుంపి పోయగా, అవి కిందనుండే స్వాయంభువ లింగము మీద పడినందున ఈశ్వరుని పూజించినట్టయింది. అదృష్టవశాత్తు ఆ రోజు మహాపర్వదినమైన శివరాత్రి కనుక, రాత్రి జాగరముండి శివుని పూజించిన ఫలము బోయవానికి దక్కింది. పైగా, పశ్చాత్తాపమువల్ల అతని కన్నులనుండి ప్రవహించిన బాష్పధారలతో స్వాయంభువ లింగాన్ని అభిషేకించటంవల్ల శివుడు ప్రీతుడై, ఆ లింగము ఛేదించుకొని వచ్చి బోయవానికి సాక్షాత్కరించాడు. జింకల పుట్టు పూర్వోత్తరాలను పరమేశ్వరుడు బోయవానికి వెల్లడించాడు. ఆయన కరుణవల్ల బోయవాని పాపములన్నీ పటాపంచలైపోయి, ముక్తిమార్గము లభించింది.

శివుని దీవనవల్ల జింకలు నక్షత్ర మండలం చేరుకొని, చుక్కలుగా మారి, జింకరూపంలో శాశ్వతంగా నిలిచిపోయినై.

ఈ జింకరూపమే ఇరవైయేడు నక్షత్రాలలోను ఒకటైన 'మృగశిర'గా ఇప్పటికీ పిలువబడుతున్నది. ఈ విధంగా, రాక్షసరాజైన హిరణ్యాక్షుడూ వాని కుటుంబమూ శివుని మహిమవల్ల శాపవిముక్తిపొంది, శాశ్వతమైన కీర్తిని సంపాదించగలిగారు.






పూర్వం ఒకప్పుడు వెనిస్ దేశస్థులకూ, తుర్కీదేశస్థులకూ మధ్య యుద్ధం జరిగింది. యుద్ధంలో పట్టుబడిన శత్రువులను ఆ కాలంలో బానిసలుగా విక్రయించివేసే వాళ్ళు. ఆ వాడుకనుబట్టి, హామెట్ అనే తుర్కీదేశస్థుడు వెనిషియన్లకు పట్టుబడి, ఫ్రాన్సిస్కో అనే ఒక ధనికుని ఇంటిపక్క బందీగా ఉన్నాడు.

ఫ్రాన్సిస్కోకు ఒకే ఒక అయిదేళ్ళ కుమారుడు. ఆ పిల్లవాడు అస్తమానమూ హామెట్ వద్దనే మసలుతూ, ఎంతో చేరికగా ఉండేవాడు. అమాయకుడైన ఆ పిల్లవాని ముఖలక్షణాలలో హామెట్‌కు దైవాంశ గోచరించింది. ఈ శత్రుదేశంలో హామెట్‌కు ఆ పసివాడు ఒక్కడే ప్రాణమిత్రుడైనాడు.

హామెట్ ఎల్లప్పుడూ విచారంగా ఉండటం పిల్లవాడు గమనించాడు. ఇది సహించలేక అతను ఒకరోజున తండ్రి వద్దకు వెళ్ళి "నాయనా! మన ఇంటి ఎదట ఒక తురుష్కుడున్నాడు. అతను ఎంత మంచివాడనుకొన్నావు కాని ఎందుకో ఎప్పుడూ విచారంగా వుంటాడు. అతని విచారం పోగొట్టి, సరదాగా ఉండేటట్టు చేయాలి నువ్వు. చేయకుంటే వీల్లేదు" అంటూ పట్టుబట్టాడు.

మొదట ఫ్రాన్సిస్కో ఉదాసీనంగా ఊరుకొన్నాడు కాని, పసివాడు అదేపనిగా బ్రతిమలాడేవరకు, మరునాడు ఫ్రాన్సిస్కో పోయి హామెట్‌ను చూచాడు.

"ఎన్నాళ్ళనించో మంచివాడు మంచివాడు అని మా పిల్లవాడు చెబుతూ వచ్చిన ఆ హామెట్ నీవేనా?" అని అడిగాడు.

"అవును. మూడేళ్ళనించీ ఈ జైలులో ఖైదీగా పడివున్న ఆ దురదృష్టపు హామెట్ నేనే! ఈ మూడేళ్ళలోనూ ఈ రాక్షస దేశంలో నా క్షేమం కనుక్కొన్నవాడు ఈ

ఆర్. వి. గుప్త, బళ్ళారి





ప.వాడు ఒక్కడే. పవిత్రాత్ముడైన ఈ ఓట్టివానిని సర్వాంతర్యామి రక్షించుగాక!" అన్నాడు హామెట్.

"హామెట్! నేను నీకు చేయగల సహాయ ముంటేచెప్పు. అందుకే ఇప్పుడు నేను వచ్చింది" అన్నాడు ఫ్రాన్సిస్కో.

"జీవితానికంతటికీ అమూల్యమైన స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకొని, శత్రుదేశంలో ఖైదీగా మగ్గిపోతూవున్న ఈ దురదృష్ట వంతునికి సంతోషం ఎక్కడినించివస్తుంది? నాస్థితి తలుచుకుని నాలో నేను కుమిలి పోవటంచూచి నీకు ఆశ్చర్యమవుతు న్నదా?" అని ఎదురుప్రశ్న వేశాడుహామెట్.

"ఇప్పటికీ ఎంతోమంది మా వెనిషి యన్లను మీ టర్కీదేశంలో బంధించారు కదటయ్యా?" అని అడిగాడుఫ్రాన్సిస్కో.

"నా దేశస్థులు చేసిన క్రూరకృత్యాలకు నేనా బాధ్యుణ్ణి? అయితే, నీ దేశస్థులు చేసిన దుర్మార్గాలన్నిటికీ నీవే బాధ్యుడి వంటాను. నిజం చెప్పాలంటే, నా మట్టుకి నేను, తోడిమానవుణ్ణి బానిసగా చేసికోవ టానికి ఎన్నడూ ప్రయత్నించలేదు. మీ దేశస్థులను కొల్లగొట్టి నేను ధనవంతుణ్ణి కావాలని ఎన్నడూ కుతూహలపడలేదు." అని బదులుచెప్పాడు హామెట్.

ఇలా చెబుతూవుండగానే, అప్రయ త్నంగా అతని కన్నుల వెంబడి బాష్ప ధారలు రాలినై. వినయపూర్వకంగా ఒక్క సారి తల వంచి, "దేముడు దయా మయుడు, అయన ఆజ్ఞను మానవుడు శిరసావహించవలిసిందే!" అన్నాడు నెమ్మదిగా.

అప్పటి హామెట్ ముఖలక్షణాలుచూచి, ఫ్రాన్సిస్కో మనసు కరగిపోయింది. "హామెట్!— ఒక చిన్నపని చేశావంటే, నీవు విడుదల అయే మార్గం చెబుతాను. ఈ వూరిలో నా శత్రువు ఒకడున్నాడు. నీవు





అతనిని ఎలాగైనా చంపాపంటే నిన్ను విడుదల చేస్తాను," అన్నాడు ఫ్రాన్సిస్కో.

ఈ మాటలకు హామెట్ ఉద్రేకపూరితుడై, నిలువెత్తునలేచి, "ఓయి నీచుడా! నీ వెనిస్‌పట్టణమంతా ధారపోసినా, నేను హంతకుడిని కాజాలను. మా జాతికంతటికీ స్వాతంత్ర్యం సమకూర్చినా అటువంటి పనిచేస్తాననుకోకు, ఛో!"—అన్నాడు.

అందుకు ఫ్రాన్సిస్కో, హామెట్ చేయిపట్టుకుని, "ఈ క్షణంనించి మనం మునపటికంటె ఎక్కువ పరిచయమూ, ఎక్కువ సంబంధమూ కలిగివుందాము. హామెట్! నీకు ఉన్నట్టే నాకుకూడా హృదయం ఉన్నదనీ, నీకువలెనే నాకునూ దయా దాక్షిణ్యమూ ఉన్నవనీ తెలుసుకో. నా కొడుకుమీది ప్రేమవల్లనే నాకు మొదట నీపైన అభిమానం కలిగింది. నిన్ను చూచినప్పటినుంచీ, ఏవిధంగా నీకు సహాయపడగలనా అనే సంకల్పం కలిగింది. నిన్నను నిన్ను చూచినతరువాత, నిన్ను విడుదల చేయించాలని నిశ్చయం చేసుకొన్నాను. ఈ నిశ్చయంతో, నీ స్వభావం తెలుసుకొవటానికి నిన్ను పరీక్షకు పెట్టినందుకు మన్నించు. పరీక్షకు నిలిచినందువల్ల, నీపైన నాకు ఉండిన గౌరవం హెచ్చయింది. ఇంతటినించి నీవు విముక్తుడవైనావు నీ అపరాధపుసొమ్ము నేను నీ యజమానుకి చెల్లించివేశాను. ఇందుకునీవు చేయతగిన ప్రత్యుపకారం ఒక్కటే. ఈ నీ స్నేహితుణ్ణి మరువకు' అన్నాడు.

ఈ మహోపకారానికి హామెట్ ఎంతగానో ఉప్పొంగిపోయాడు. టర్కీదేశానికి పోయే ఒక ఓడపైన అతనిని ఎక్కించి మరికొంత ధనంకూడా యిచ్చి పంపాడు. ఫ్రాన్సిస్కో. తన విడుదలకు కారకుడైన ఆ చిట్టివానిని కౌగిలించుకుని, హామెట్ చిన్న పిల్లవానికంటె ఎక్కువగా విడప



జొచ్చారు. వానిని అనేకవిధాల ఓడించి, విడువలేక విడువలేక, విడనాడి పోయాడు.



హోమెట్ తన దేశానికి వెళ్లిపోయిన ఆరు నెలలకు, ఒకనాటి తెల్లవారుజామున అకస్మికంగా ఫ్రాన్సిస్కో ఇల్లు అంటుకొన్నది. అప్పుడు అందరూ గాఢనిద్రలో వున్నారు. తీరా, జనానికి మెలకువ వచ్చేటప్పటికి ఇల్లంతా అంటుకుని, ఆ మంటల లోకి చొరటానికి ఏమాత్రం సాధ్యం కాలేదు. ఈ స్థితిలో, ఫ్రాన్సిస్కో చిన్నికుమారుడు ఇంటిలోపల ఉండిపోయినట్టు తెలియ వచ్చింది. ఆ తండ్రి దుఃఖం ఇటువంటిదని



చెప్పటానికి ఎవరి తరం? కొడుకును రక్షించుకోవటానికని మంటలలోకి ఉరుకబోయాడు. కాని, అందరూ కలిసి ఫ్రాన్సిస్కోను ఆపుచేశారు. అతను, "నా చిట్టివాడిని రక్షించండి, పుత్రభిక్ష పెట్టండి. నా ఆస్తి అంతా బహుమతిగా తీసుకోండి!" అంటూ గగ్గోలుపెట్టాడు. డబ్బుకి ఆశపడి, పిల్లవాడిని రక్షించటానికి చాలామంది ప్రయత్నించారు. కాని, లాభంలేకపోయింది.

ఇంతలో ఒక మనిషి, పరుగెత్తుకుంటూ వచ్చి ఆ మంటలలో చొరబడ్డాడు. వెంటనే పొగలు మేఘమండలానికంటా కమ్మేయడంచేత, అతను ఆ మంటలో పడి చచ్చిపోయివుంటాడని నిశ్చయించారు.

కాని మరుక్షణమందే, ఒక వ్యక్తి ఆ మంటలలోనించి, పొగలలోనించి, ఒక బిడ్డను చంకనెత్తుకు రావటం చూచి జనమంతా జేజేలు కొట్టారు. క్షేమంగా బయటకు వచ్చిన ఆ బిడ్డ ఫ్రాన్సిస్కో కొడుకేనని తెలిసి వారు ఉప్పొంగిపోయారు. ఇక ఆ తండ్రి సంతోషం చెప్పాలా!

తన చిట్టివాడిని రక్షించి తీసుకువచ్చిన ఆ పుణ్యాత్ముడు ఎవరా అని ఫ్రాన్సిస్కో





నిదానించి చూచాడు. కాని, బూడిదలోనూ బొగ్గుమసిలోనూ కప్పబడిపోయిన ఆ మనిషి ఎవరో ఆనవాలు దొరకలేదు. "మహానుభావా!- ఇదుగో ఇప్పటికి ఇది తీసుకో. రేపటిరోజున నా ఆస్తిఅంతా నీకు వ్రాసి ఇస్తాను" అంటూ, బంగారు నాణాలుగల ఒక సంచీ ఈయబోయాడు ఫ్రాన్సిస్కో.

"నాకా? బహుమానమా? వద్దయ్యా వద్దు. నాకు నీ బహుమతి అక్కరలేదు." అంటూ నిరాకరించాడు ఆ వ్యక్తి.

ఈ గొంతుక లోగడ ఎగిరివున్నదేనని తోచి, ఫ్రాన్సిస్కో పరికించి చూచాడు. చూస్తూనే, 'అరె!—నీవా! హామ్లెట్‌వా!!' అంటూ అతనిని కౌగిలించుకున్నాడు.

ఆరు నెలలక్రిందట, తను విడుదలచేసి పంపిన హామెట్ తిరిగి బందీగా తనదేశం రావటంచూచి ఫ్రాన్సిస్కో ఎంతో ఆశ్చర్యపోయి, "మళ్లీ ఎలా వచ్చావు హామెట్?" అని ఎంతో ఆత్రంతో అడిగాడు.

"అదంతా దేవుని కృప" అని ముక్తసరిగా జవాబుచెప్పాడు హామెట్.

"అవునులే, నీవు మళ్లీ ఎలావచ్చావో చెప్పు హామెట్?" అని వేగిరపాటుతో మళ్లీ అడిగాడు ఫ్రాన్సిస్కో.

"నీవు దయతో నన్ను విముక్తునిచేసి, సాగనంపావు. నేను నా అదృష్టానికి సంతోషిస్తూ నా దేశం చేరుకునేసరికే మీ వెనెషియన్లు నా తండ్రిని బందీచేసి, బానిసగా తీసుకొని ఓడ ఎక్కించారు. అప్పుడు నేను, నా తండ్రిని బంధించినవానివద్దకు ఉరుకులు వేసికొంటూపోయి, 'అయ్యా! నా తండ్రి వృద్ధుడైపోయాడు. ఆయనను బాధిస్తే మీకు కలిసివచ్చే దేమున్నది? నేను నా తండ్రికంటె దృఢకాయుణ్ణి. మీకు సేవ చేయుటానికి శక్తికలవాడను. కనుక, ఆయనను వదిలిపెట్టి, బదులుగా నన్ను పట్టుకపొండి' అనిచెప్పి, నీవు నాకు కానుకగా

యిచ్చిన డబ్బు వాళ్ళకి యిచ్చి, 'దీనిని నా తండ్రిని వదలినందుకుగాను అపరాధ రుసుముగా తీసుకోండి'' అని పరిపరివిధాల వేడుకొనేటప్పటికి, ఆయన దయతలిచి, నా తండ్రినివదలి నన్ను బానిసగా తీసుకొన్నాడు. మా తండ్రి ప్రయాణం చేయువలసిన ఆ ఓడమీదనే నేను బయల్దేరి, మళ్లీ ఈ పట్టణం చేరుకొన్నాను. ఈసారి నేనెంతో అష్టపడి మీ దేశానికి బానిసగావచ్చాను. కాని, మనస్సులో ఏమాత్రమూ బాధపడలేదు. పరమేశ్వరుడు ఇదీ ఒక మంచికే చేసివుంటాడని నమ్మి కాలక్షేపం చేస్తూవుండగా, నా ఊహ నిజమేనని తేలింది. నేను మళ్లీ బందీగా ఉండటంచేతనే హామెట్ కృతఘ్నుడు కాడని నీకు రుజువయింది. అంతకంటె ముఖ్యంగా, నేను నిమిత్తమాత్రుడునై పసివాడి ప్రాణాలు నిలిపి, నీకు సౌఖ్యం చేకూర్చగలిగాను," అంటూ తన కథ వినిపించాడు హామెట్.

చిత్రమైన ఈ చరిత్ర విన్నప్పటినించీ వారుభయులమధ్యా ప్రేమాభిమానాలు ఎక్కువగా అల్లుకుపోయినై. "హామెట్ !. నా ఆస్తి అంతా నువు తీసుకో. నువ్వింక నాతో ఇక్కడనే ఉండిపో!" అని ఎన్నో విధాల బతిమలాడాడు, ఫ్రాన్సిస్కో. కాని, అతనికి మనస్కరించలేదు.

మహాత్యాగి అన హామెట్ ఋణం తీర్చుకొనటానికి గత్యంతరం కనపడక, ఫ్రాన్సిస్కో చివరకు, చేయగలిగినంత ఉపకారం చేయటానికి నిశ్చయించుకొన్నాడు. ఈసారి మళ్లీ హామెట్‌ను విడిపించటమేగాక, వెనిస్‌కు బానిసలుగా తీసుకురాబడే తుర్కిదేశస్థులను విడిపించటంకోసమే తన యావదాస్తినీ వినియోగిస్తున్నానని ప్రకటనచేశాడు.

తరువాత, హామెట్ పసివాడిని విడవలేక విడవలేక ఎలాగో మనస్సు కుదుటపరచుకుని తిరిగి తన దేశం వెళ్ళిపోయాడు.





## ఆధారములు

### అడ్డము

1. వంశము
5. ఇది చేదుగా వుంటుంది
6. పంక్తులు
7. ఒక సాధుజంతువు అరుపు
9. చెప్పు
10. అడవి
13. ఫిడేలు దీనితో వాయిస్తారు
14. ఉద్యోగము
16. గాలిలో ఎగిరేది
17. బుద్ధి
18. ఒక అవతార పురుషుడు
20. స్త్రీ




### నిలువు

2. ఒక పుణ్యక్షేత్రము
3. సముద్రంలో దొరుకుతై
4. కవులు అల్లుతారు
5. ఎండాకాలం
7. శకుంతల తల్లి
8. తల్లి తమ్ముడు లేక అన్న
11. పూర్వము
12. ఇప్పుడు మీ చేతిలో వున్నాను
14. రాయి
15. విన్నపము
18. ఆట
19. పొగడ్త



# పిల్లల పెంపకం

## మాటా - పలుకూ

బిడ్డలకు మాటలు వచ్చే వయస్సు ఇదీ అని కచ్చితంగా చెప్పలేము. కొంతమందికి మూడేళ్ళకుగాని సరిగా మాటలు నేట పట్టవు. అంతమాత్రాన వాళ్ళు చురుకైనవాళ్ళూ తెలివైనవాళ్ళూ కారనటానికి వీలులేదు.

సామాన్యంగా సగటున పిల్లలు, ఏవయస్సులో ఎలా మాటా పలుకూ ఆడుతారో సూక్ష్మంగా చెబుతాను, ఏడాదిలోపు బిడ్డలు చూచిన ప్రతివస్తువూ ఫలానా అని గుర్తించి సరిగా పోల్చుకోగలిగివుండాలి; కుర్చీ, బల్ల, మంచం, కుంచం - అంటూ చూచిన వస్తువుల పేర్లు చిన్నవైతే చెప్పగలరుకూడాను.

ఏణ్ణర్థం వచ్చేసరికి రెండేసి మూడేసి మాటలు చేర్చి "చందమామా దాయి దాయి!!" అంటూ చిన్నారి చిలకపలుకులు చెప్పగలుగుతారు.

రెండేళ్ళు పూర్తి అయినవంటే చిన్నచిన్న వాక్యాలు తప్పులులేకుండా కూర్చ గలరు. పెద్దవాళ్లు చెప్పిన పనులు - అనగా "చిట్టీ! ఆ వస్తువు ఇలా పట్టుకరా!"— "చిన్నా! ఇది పట్టుకపోయి నాయన కివ్వు!" అంటూ చెప్పినప్పుడు అర్థంగ్రహించి ఆ పనులు చక్కగా చేయగలరు.

మూడోయేడు ప్రవేశించినప్పటినించీ చెప్పిన మాటలూ పనులూ కొంచెంసేపే రావచ్చు, జ్ఞాపకం పెట్టుకోవటానికి బిడ్డలు ప్రారంభించాలి.

బిడ్డలకు మాటలు, నేర్పేటప్పుడు సాధారణంగా ముద్దుకోసం వాళ్లు పలికే 'తొక్కు పల్కులు' ఉచ్చరిస్తూవుంటారు పెద్దవాళ్లు. కాని, సరియైన స్పష్టమైన ఉచ్చారణతోనే పల్కటం మంచిదని ఈనాడు చాలామంది తల్లుల అభిప్రాయం.

'మీ పెద్దమ్మ'

వి. వీరలక్ష్మి, పెద్దాపురం





ఇది ఆరు భాగాలుగా కోసిన ఒక చిక్కు బొమ్మ. ఈ భాగాలని మీరు ఒకవిధంగా కలిపెట్టయితే ఆ బొమ్మ ఏమిటో మీకు తెలిసిపోతుంది. మీరు యిది చెయ్యగలరా? మీకు చేతగాకపోతే జవాబుకు 55-వ పేజీ చూడండి.

# యుక్తి లెఖ్ఖ

ఒక బడిలో పదిమంది పిల్లలు కలిసి ఒక నాటకం వేశారు. నాటకంలో బాగా నటించిన వాళ్లకి బహుమతులుకూడా ఏర్పాటు చేశారు. నాటకం చూడటానికి అవూరి పెద్దలంతా వచ్చారు. నాటకం పూర్తి అయింది. నలుగురు పిల్లలు చాలా అద్భుతంగా నటించారు. వాళ్లకి బహుమతులకింద ఇరవై నాలుగు పుస్తకాలు తెప్పించి ఆ పుస్తకాలకు 1 నించి 24 వరకు వరుసనంబర్లు వేశారు. ఒకటవ నంబరు పుస్తకం ఖరీదు 1 అణా. రెండో నంబరు పుస్తకం ఖరీదు రెండు అణాలు; మూడో నంబరు పుస్తకం ఖరీదు మూడు అణాలు; యిలా ఎన్నో నంబరు పుస్తకమైతే అన్ని అణాలు దాని ధర అని నిర్ణయించారు. నలుగురు పిల్లలూ సరిసమానమైన చాకచక్యంతో నటించారు కనుక బహుమతులు పంచటం విషయంలోకూడా హెచ్చుతగ్గులు రాకూడదని నిర్ణయించారు. ఇది ఎలా చెయ్యటమా అని ఆలోచించి చివరకు ఒకవిధంగా నిశ్చయించారు. ఎలా అంటే: వున్న ఇరవై నాలుగుపుస్తకాలూ నలుగురికీ ఆరేసి చొప్పున రావాలి. కాని, ఒక్కొక్కళ్లకి బహుమతిగా వచ్చిన ఆ ఆరు పుస్తకాల మొత్తపు ఖరీదుకూడా సరిసమానంగా వుండాలి. మొత్తం నలభై పుస్తకాల ఖరీదు 300 అణాలు అవుతుంది. నలుగురికీ ఆ పుస్తకాలు ఆరేసి చొప్పున పంచగా ఒక్కొక్కరికి వచ్చిన పుస్తకాల మొత్తం ఖరీదు 75 అణాలు రావాలన్నమాట. ఇది ఎలా చెయ్యటమో అక్కడికి వచ్చిన పెద్దలకెవరికీ తెలియలేదు. కాని, ఒక చిన్న కుర్రవాడు వచ్చి ఒక్క నిమిషంలో పుస్తకాల్ని ఆ నలుగురికి పంచేసరికి ఎవరికీ హెచ్చుతగ్గులు లేకుండా సరిపోయినై. ఆ కుర్రవాడు ఎలా పంచాడో కనుక్కోండి. కనుక్కోలేకపోతే జవాబుకి ఇక్కడే వుంది, చూడండి.

---

మొదటి కుర్రవానికి 1, 8, 9, 16, 17. 24 నెంబరుగల పుస్తకాలూ
రెండవ కుర్రవానికి 2, 7, 10, 15, 18, 23 నెంబరుగల పుస్తకాలూ
మూడవ కుర్రవానికి 3, 6, 11, 14, 19, 22 నెంబరుగల పుస్తకాలూ
నాల్గవ కుర్రవానికి 4, 5, 12, 13, 20, 21 నెంబరుగల పుస్తకాలూ
వచ్చేటట్లు పంచితే అందరికీ సరిసమానంగా బహుమతులు పంచినట్లవుతుంది




అక్కడ తొమ్మిదిమంది దొంగలూ, రూపాయల సంచీ ఉన్నాయ్. ఒక వైపునించి మరోవైపుకి నాలుగు గీతలుగీసి తొమ్మిదిమంది దొంగల్నీ, రూపాయల సంచినీ వేరుచెయ్యాలి. గీతలు వంకరటింకరగా వుండకూడదు. గీతలు దొంగల్నికానీ, రూపాయల సంచినికానీ తాకకూడదు. మీకు తెలియకపోతే జవాబుకి 55-వ పేజీ చూడండి.

# ఇంద్ర  జాలము

## పేకముక్కను మాయంచేయటం

ప్రేక్షకులు చూస్తూవుండగానే, వారు ఎంచుకున్న పేకముక్కను మాయం చేయవచ్చు. ఇది చూడటానికి చాలా కష్టసాధ్యమైన ట్రిక్కుగా కనిపిస్తుంది, కాని చేయటానికి ఇంత తేలికైన ట్రిక్కు మరొకటి లేదనవచ్చు.

ఎలా అంటే— ఒక పేకదస్తా తీసుక వచ్చి; ఒక ముక్క వెనకవేపు మరోముక్క కనిపించేట్టు అంటించివేయాలి. అంటే ఇలా అంటించిన తర్వాత ఏదైనా ఒక ముక్క తీసి చూస్తే ఒకవైపున ఆటీను అను వుందనుకోండి మరొవైపు ఏ డైమను తొమ్మిదో లేక మరోముక్కో కనపిస్తుంది.

ఇప్పుడు మొత్తం 52 ముక్కలూ నీవద్ద ఉంటై. కాని, రెండేసి ముక్కలు గల 26 ముక్కలుమాత్రమే లెక్కకు వస్తయి. ఈ 26 ముక్కలతోనే ట్రిక్కు నడపాలి.

తర్వాత—నీవద్దఉన్న 26ముక్కలనూ ప్రేక్షకులవేపు తిప్పి పట్టుకో.

అప్పుడు ప్రేక్షకులలో ఒకరిని పిలిచి, "దీంటో ఒక ముక్క కొంచెం పైకి లాగి ఆ ముక్క ఏదో గుర్తు వుంచుకోండి" అంటావు. ప్రేక్షకుడు వచ్చి ఒక ముక్క నీవు పట్టుకున్న ముక్కల్లోంచి కొంత వరకు లాగి వెడతాడు. తర్వాత మరో ప్రేక్షకుణ్ణికూడా పిలిచి, అతనినీ ఒక ఒక ముక్క లాగమను. అతనూ ఒక ముక్క సగంవరకు పైకి లాగి వెడతాడు.

అప్పుడు నువ్వు-"చూడండి. ఇప్పుడు వీరిద్దరూ కోరుకున్న రెండు ముక్కలూ పేకలో లేకుండా మాయం చేస్తాను" అని చెబుతూ ఆ రెండు ముక్కల్నీ ప్రేక్షకులు చూడకుండా చాకచక్యంతో తిరగవేసి పేక కలిపి ప్రేక్షకులకి చూపి "ఇప్పుడు చూడండి మీరు కోరుకున్న ముక్కలు రెండూ మాయమైనాయో లేదో" అనాలి నిజానికి మాయమైనవనే అనుకుని వాళ్లు చాలా ఆశ్చర్యపోతారు.

కాని, ఈ ట్రిక్కు చేసేటప్పుడు ఒక విషయం గుర్తుంచుకోవాలి. పేక ముక్కలు వాళ్లకి చూపేటప్పుడు రెండోవైపు ముక్కలు అతికించి వున్నట్టు ప్రేక్షకులకు తెలియకుండా జాగ్రత్తపడాలి. లేకపోతే మీరు దొరికిపోతారు.



కొద్ది జాగ్రత్తతో చేస్తే, తప్పిపోతామనే జంకు లేకుండా, ఈ ట్రిక్కు ఎన్నిసార్లయినా నిర్భయంగా చేయవచ్చు.

[ఆసక్తిగల పాఠకులు, ఈ గారడీనిగురించి ఉచితంగా సలహా పొందదలిస్తే, వారు 'చందమామ' పత్రిక పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. మీరు వారికి ఉత్తరాలు ఇంగ్లీషులోనే వ్రాయాలి. వారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మేజిషియన్,
పోష్టుబాక్సు 7878, కలకత్తా—12 ]

పజిలుకు జవాబు :




దొంగలబొమ్మకి జవాబు :

నాలుగు గీతలూ ఈ క్రిందివిధంగా గీసినట్టయితే దొంగల్ని వేరుచేయగలరు

2 నుంచి 32 వరకు; 9 నుంచి 26 వరకు
13 నుంచి 35 వరకు; 20 నుంచి 46 వరకు

కత్తిరించినబొమ్మకి జవాబు :






ఈ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులు వేసిన బొమ్మని వచ్చేనెల (జూన్) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor: SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press, Madras-1

